# శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కృతులు

## నవావరణ కీర్తనల వ్యాఖ్యాన సహితము



సంకలన, పరిశోధనకర్తలు :
టి. ఎస్. పార్థసారథి
భావరాజు నరసింహారావు



త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్టణము - 521 001

# విషయసూచిక

## IV. తిరువారూరు త్యాగరాజ కీర్తనలు



## V. తిరువారూరు శివలింగ కీర్తనలు



## VI. నవావరణ కీర్తనలు

## VII. నవగ్రహ కీర్తనలు

## VIII. విడి కీర్తనలు

## IX. ఇతర కృతులు

## X. రాగాంగరాగమాలికలు

# అకారది సూచిక

# విజ్ఞప్తి

కర్ణాట సంగీత వాగ్గేయకారులలో శ్రీ త్యాగరాజస్వామి, శ్రీ ముత్తుస్వామి దీక్షితులు, శ్రీ శ్యామాశాస్త్రి అను త్రిమూర్తులు ప్రసిద్ధులు. శ్రీ త్యాగరాజస్వామి కృతులనూ ( రెండు సంపుటములు ), శ్రీ శ్యామ శాస్త్రి కీర్తనలనూ సంకలనముచేసి ప్రచురించినాము. ఇప్పుడు శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కృతులను సంగీత రసజ్ఞలోకమునకు అందించు భాగ్యము కలిగినది.

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కీర్తనలు భక్తిమయములు. వేద వేదాంగోపనిషత్తుల సారముతో నిండినవేకాక, మంత్రశాస్త్రరహస్య భూయిష్ఠములై భక్తితో గానముచేయువారికి పరమార్థదాయకములగు చున్నవి. ఇట్టి వీరి ఉత్తమ కీర్తనలు దక్షిణదేశమున అంతటనూ ప్రచారములో ఉన్నవి. వీటిని బహుళ ప్రచారములోనికి తీసికొని రావలసిన అవసరమును గుర్తించి ఈ సంపుటమును సంగీత ప్రియులకు సమర్పించుచున్నాము.

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల సమగ్ర జీవితచరిత్రనూ, మంత్రశాస్త్ర రహస్యములతో నిండిన నవావరణ కీర్తనలకు విపులవ్యాఖ్యానమునూ యిందు చేర్చినాము. సాహిత్యములోనూ, మంత్రశాస్త్రములోనూ నిష్ణాతులైన శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు ఈ మహాత్కార్యాన్ని నిర్వహించినారు. వారికి మా ధన్యవాదములు.

—ప్రచురణకర్తలు

శ్రీః

# శ్రీ ముత్తుస్వామి దీక్షితులు

కర్ణాటకసంగీతరత్నత్రయమున శ్రీ త్యాగరాజు తరువాత గణింపవలసిన వాగ్గేయకారకరత్నము శ్రీ ముత్తుస్వామి దీక్షితులు. ఆయన సంగీతమునందేగాక వేద, వేదాంత, యోగ, మంత్రశాస్త్ర, జ్యోతిష, ఆగమనిష్ణాతుడు. భక్తవరేణ్యుడు, పెద్దలను భక్తిశ్రద్ధలతో శుశ్రూష చేసినవాడు. యావద్భారత సంచారమును చేసినవాడు. బహు తీర్థయాత్రాపరుడు. శ్రీ ముత్తుస్వామి దీక్షితుల ప్రభావముద్ర ఆయన సమకాలీన సంగీతవిద్వాంసులపైన కూడ నుండినది. తరువాతకాలమున వచ్చిన సంగీతవిద్వాంసు లందరిపైన ఆయన ప్రభావము ప్రస్ఫుటముగా నున్నది.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కర్ణాటక సంగీతమునందేగాక ఉత్తర భారత (హిందూస్తానీ) సంగీతమునందు కూడ విశేషశ్రమ చేసినవాడు. ఆయనకు పాశ్చాత్య సంగీతము కూడా తెలియుననుటకు కొన్ని నిదర్శనములు కన్పించుచున్నవి.

ఆయనకు మాతృభాషయైన తమిళమునందు విశేషపాండిత్యముండుట మాత్రమేగాక, సంస్కృతమునందు అపారమైన పాండిత్యమున్నది. ఆయన సంస్కృతమున కావ్య, అలంకార, వ్యాకరణములను అధ్యయనము చేసినవాడు. ఆయనకు తెలుగునందుకూడ సమున్నతమైన పాండిత్యముండినది. ఆయన సంస్కృతమునందే పెక్కుకీర్తనలను రచించినప్పటికి, కొన్ని రచనలను తెలుగునందుకూడ చేసెను. మరికొన్ని కీర్తనలలో సంస్కృత, ఆంధ్ర, తమిళ భాషలను కలిపి మణిప్రవాళశైలిగా ఉపయోగించెను. మణిప్రవాళశైలి అనగా మణులు, ప్రవాళములు (పగడములు) కలిపి గ్రుచ్చిన హారమువంటి శైలి. సంస్కృతమున పల్లవిని ప్రారంభించి, తరువాత తెలుగు నందొక చరణమును, తమిళమునందు మరొక చరణమును రచించి కీర్తనను మణిప్రవాళహారమును చేసెనన్నమాట.

తన సంగీత భక్తిభావావేశమును వెల్లడించుటకు మాతృభాషయైన తమిళమును కాదని, సాధువై, మాధుర్యప్రవాహరమణీయమై, శ్రావ్యమైన తెలుగుభాషనుగ్రహింపక, శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తనకృతులకు సంస్కృత భాషను గ్రహించుటకు కారణ మున్నది. సంస్కృతము ధ్వనివంతమైనది. సంస్కృతశబ్దోచ్చారణలో నొక మ్రోయుటవంటి ధ్వని యున్నది. దివ్య గంభీర ఘనత్వమును కలిగి యున్నది. శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి కృతులలోని ప్రత్యేకత వాటియందున్న రాగసంచారముల యొక్క సౌందర్యశ్రేష్ఠత, ఉత్కృష్టతలలో నున్నది. అందుచేత నాయన సంస్కృతమును తనకీర్తనలకు భాషాకారముగా స్వీకరించుట సమంజసముగానున్నది. శ్రీ దీక్షితులవారి కృతులలోని రాగముల చిత్రములు పరిపూర్ణముగా పుష్టిగా నుండగా—ఆ కృతులకు స్వరూపమిచ్చిన సాహిత్యము (స్వరనాదదృష్టిలో) దివ్య మహత్తర ఉదాత్తభావనాసూచకముగా నున్నది. ఆయనకృతు లన్నియు దేవతాసంకీర్తనములగుటవలన, ఆయనకు కావలసిన సాహిత్యభావములు సంస్కృతమున అనంతముగా లభించినవి.

దక్షిణదేశమున విరించిపురమను గ్రామము ఉత్తర ఆర్కాడు మండలమున కాట్పాడునకు 14 కిలోమీటర్ల దూరమున నున్నది. ఇది మద్రాసునకు 90 మైళ్ల దూరము. ఆంధ్ర తమిళ భాషలు సమానముగా నున్న గుడియాతమునకిది 8 మైళ్ల దూరము. ఆగ్రామమున ఆపస్తంబ సూత్ర కాశ్యపసగోత్రుడైన (తమిళ వడమ) బ్రాహ్మణుడు వేంకటేశ్వర దీక్షితులు. ఆయన భార్య భాగీరథి. వారికి క్రీ. శ. 1735 సంవత్సరమున రామస్వామి దీక్షితులను పేరుగల పుత్రుడు జనించెను. వేంకటేశ్వర దీక్షితులు తన కుటుంబముతో విరించిపురమునుండి కావేరిప్రాంతమున తంజావూరు మండలములోని గోవిందపురమునకు క్రీ. శ. 1742 సంవత్సరమున వలసవెళ్ళెను. తంజాపురనాయకరాజుల పరిపాలనలో తొలి రోజులలో ప్రధానమంత్రిగా నున్న మహావిద్వాంసుడు గోవింద దీక్షితులు నిర్మించిన దీ గోవిందపురాగ్రహారము.

వేంకటేశ్వర దీక్షితులు, అతని భార్యయు క్రీ. శ. 1751 సంవత్సరమున దివంగతులైరి. రామస్వామి దీక్షితులు గోవిందపురమునుండి తంజావూరు

వెళ్ళి రాజాస్థాన సంగీతవిద్వాంసుడైన వీరభద్రయ్యదగ్గర సంగీతము నేర్చుకొని విద్వాంసుడై తిరిగి గోవిందపురాగ్రహారమునకు వచ్చెను. సంగీత శాస్త్రమునుకూడ కూలంకషముగా మథింపదలచి రామస్వామి దీక్షితులు మధ్యార్జున క్షేత్రమున నున్న వైణిక విద్వాంసుడు వెంకట వైద్యనాథ దీక్షితుల నాశ్రయించెను. తంజావూరునాయకరాజులకు ప్రధాన సచివుడై, మహావిద్వాంసుడని ప్రఖ్యాతిపొందిన గోవింద దీక్షితులు సంగీత శాస్త్రజ్ఞుడుకూడ. ఆయన "సంగీతసుధ" యను సంగీతశాస్త్ర గ్రంథ మును రచించెను. గోవింద దీక్షితుల కుమారుడు వెంకటమఖి. వెంకటమఖి రచించిన ప్రసిద్ధ సంగీతశాస్త్ర గ్రంథము "చతుర్దండి ప్రకాశిక". సంస్కృత వ్యాకరణమునకు పాణిని ఎట్టివాడో, కర్ణాటక సంగీతశాస్త్రము నకు వెంకటమఖి అట్టివాడు. అతని వంశపు డీ వెంకట వైద్యనాథ దీక్షితులు. వెంకటమఖి ప్రతిపాదించిన 72 మేళరాగములు, జన్యరాగ సంపద వెంకట వైద్యనాథ దీక్షితులు తన్నాశ్రయించిన రామస్వామి దీక్షితులకు నేర్పెను.

సంగీతకారుడుగా, శాస్త్రజ్ఞుడుగా రామస్వామి దీక్షితులు శీఘ్ర ముగా కీర్తిగడించి తంజావూరు రాజు ఆదరమును పొందెను. తంజావూరు సమీపమున తిరువారూరు గ్రామమున త్యాగరాజస్వామి దేవాలయమున నాదస్వరకచేరీలు జరిపించుటకు రామస్వామి దీక్షితులు నియమింపబడెను. రామస్వామి దీక్షితులు కనిపెట్టిన హంసధ్వని రాగము నేడు యావద్భారత ప్రశస్తి పొందినది. అతడు పెక్కుకృతులను, వర్ణములను, దరువులను, కీర్తనలను, రాగమాలికలను రచించెను.

రామస్వామి దీక్షితులు చిదంబరనాథస్వామి యను సన్న్యాసి యనుగ్రహమువలన శ్రీవిద్యయందు పూర్ణాభిషిక్తుడయ్యెను. చాల సంవత్సర ములు సంతానము లేకుండుటవలన వైదీశ్వరన్ కోవెల యను గ్రామమున వేంచేసియున్న అమ్మవారు బాలాంబికాదేవిని సేవింపదలచి తన భార్య సుబ్బలక్ష్మిఅమ్మాళ్ తో కలసి అచ్చటకుపోయి నలుబదిదినములు ఆగమోక్తముగ నవావరణ పూజలను చేయుచు, భజనలను చేయుచు గడపెను. నలుబదియవ దినమున రాత్రి అతనికి శ్రీదేవి స్వప్నదర్శన మిచ్చి యొక ముక్తాహారమును (ముత్యాల హారమును) ప్రసాదించెను.

ఆ సుఖస్వప్నమునకు సంతోషపడి, శ్రీదేవి సంతాన మనుగ్రహించినదని విశ్వసించి రామస్వామి దీక్షితులు తిరువారూరునకు తిరిగి వచ్చెను.

తరువాత (క్రీ. శ. 1776 సంవత్సరమున మార్చి 24) మన్మథనామ సంవత్సర ఫాల్గుణ మాసమున తిరువారూరు త్యాగరాజస్వామివారి ఆలయమున వసంతోత్సవములు జరుగుచుండగా కృత్తికా నక్షత్ర సమయమున రామస్వామి దీక్షితులకు పుత్రసంతానము కలిగెను. శ్రీదేవి బాలాంబిక అనుగ్రహముచే కలిగినవాడని ఆ పుత్రునకు వైదీశ్వరన్ కోవెలలో కార్తికేయుని పేరైన ముత్తుకుమారస్వామి యని-రామస్వామి దీక్షితులు పేరుపెట్టెను. ఆ పేరు 'ముత్తుస్వామి' అయినది. ఆ బాలుడు కృత్తికా నక్షత్ర సమయమున జన్మించుట, స్వప్నమున శ్రీబాలాంబిక ముక్తాహారము నిచ్చుట (ముక్తా అను సంస్కృత శబ్దమునకు తెలుగు ముత్యము, తమిళము ముత్తు) కూడ కారణముగా ముత్తుస్వామి యని పేరు పెట్టబడినది.

శ్రీముత్తుస్వామి దీక్షితులు "భజ రేరే చిత్త బాలాంబికాం" అను కృతిలో తన జన్మవృత్తాంతమునకు సూచన కలదు. (భావరాగతాళ మోదినీం, । భక్తాభీష్టప్రదాయినీం । సేవకజనపాలన గురు గుహ రూప ముత్తు కుమార జననీమ్ । భజరేరే చిత్త బాలాంబికాం । భక్తకల్పలతికాం ॥) రామస్వామి దీక్షితులకు మరి యిద్దరు కుమారులు, ఒక కుమార్తెయు కలిగిరి. వారి పేర్లు చిన్నస్వామి, బాలస్వామి, బాలాంబిక.

తండ్రి రామస్వామి దీక్షితులు కుమారుడైన శ్రీ ముత్తుస్వామి దీక్షితుల విద్యాభ్యాసమును గురించి ప్రత్యేకశ్రద్ధ వహించెను. అతనికి వేదమును చెప్పించుటమాత్రమేగాక సంస్కృతభాషాధ్యయనముకూడ చేయించెను. సంస్కృతమున కావ్యములు ముగించి, అలంకారశాస్త్రము పూర్తిచేసిన తరువాత వ్యాకరణగ్రంథములను చెప్పించెను. తానే స్వయముగా సంగీతమునందు శిక్షణ చేసెను. సంగీతసాధన మాత్రమే గాక, సంగీతశాస్త్రమర్మములనుకూడ తెలియుట ముఖ్యమని బహు రహస్యములను విశదీకరించెను. వెంకటమఖి నిర్మించిన కర్ణాటకసంగీత విధానమును శ్రీ ముత్తుస్వామి దీక్షితులు సులభముగా అవగాహన చేసికొని నిష్ణాతు డయ్యెను. ఆయన గాత్రసంగీతమునందుమాత్రమే గాక వీణా వాదనయందుకూడ నిష్ణాతు డయ్యెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు బాలుడుగా నుండి విద్యాభ్యాసము చేయుచున్న కాలమున నొక ముఖ్యసంఘటన జరిగినది. నేటి మద్రాసునకు ఉత్తరముగా సమీపముననున్న మణలి ఆకాలమున నొక జమిందారీ స్థానము. దాని ప్రభువు ముత్తుకృష్ణ మొదలియారు తిరువారూరునకు తీర్థయాత్రావశమున వచ్చి రామస్వామి దీక్షితులను చూచుట, ఆయన సంగీతమును వినుట తటస్థించినది. ఆ సంగీతమునకు ముగ్ధుడై రామస్వామి దీక్షితులను తనసంస్థానమున సంగీతవిద్వాంసుడుగా నుండుమని ప్రార్థించెను. రామస్వామి దీక్షితులు అంగీకరించి తనకుటుంబముతో మణలికి వచ్చి స్థిరపడెను.

మణలిలో దీక్షితుల కుటుంబమునకు సుఖముగా గడచెను. దీక్షితుల ప్రఖ్యాతి పెరిగెను. జమీందారు అమితగౌరవము చూపెను. ముత్తుకృష్ణ మొదలియారు కొలదికాలమునకే మరణించగా, అతని కుమారుడు వెంకట కృష్ణ మొదలియారు దీక్షితుల కుటుంబమును తండ్రినిమించి గౌరవించెను. రామస్వామి దీక్షితులు తానురచించిన రాగమాలికకృతి నొక దానిని ముత్తుకృష్ణ మొదలియారునకు అంకితము చేసెను.

వెంకటకృష్ణ మొదలియారు మదరాసు జార్జికోటలో ప్రభుత్వము నెరపుచున్న ఈస్టిండియాకంపెనీవారికి దుబాసీ (ద్విభాషి) కూడ. అతను జార్జికోటలో అంగ్లేయుల బ్యాండువాద్యమును వినుచుండుటవలన పాశ్చాత్య సంగీత స్వభావమెరిగినవాడు. తనవెంట బాలురైన శ్రీ ముత్తుస్వామి దీక్షితులను, ఆయన సోదరులను జార్జికోటకు తీసికొనివచ్చి వారికి పాశ్చాత్య బ్యాండు సంగీతమును విన్పించెను. దానివలన శ్రీముత్తుస్వామి దీక్షితులు కొన్ని పాశ్చాత్యసంగీత మర్మములను ఆకళింపు చేసికొనగల్గెను. తరువాత కొన్నినాళ్ళకు కల్నల్ బ్రౌను* అను ఆంగ్లేయుని కోరికపై శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కొన్ని ఆంగ్ల పాటల ట్యూన్లకు (tunes) సంస్కృత సాహిత్య (శబ్ద) మును కూర్చెను. అట్టివి నేటికి ఏబది లభించుచున్నవి. ఇట్టివాటిలో ముఖ్యమైనది 'గాడ్ సేవ్ ది కింగ్'

* ఈ బ్రౌను రాయలసీమ జిల్లాలలో కలెక్టరు ఉద్యోగము చేసి తెలుగు నిఘంటువు వ్రాసిన బ్రౌను దొర.

( God save the king ) అను ఆంగ్లజాతీయ గీతమునకు సంబంధించినది. దీనికి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కూర్చిన సంస్కృత శబ్దముల తొడిగింపు దేవీపరముగ నున్నది. అది,

"సంతతం పాహి మాం సంగీతశ్యామలే సర్వాధారే।
జననీ చింతితార్థప్రదే చిద్రూపిణీ శివే।
శ్రీ గురు గుహ పూజితే శివమోహాకారే।
సంతతం పాహిమాం॥"

దీక్షితుల కుటుంబమునకు పాశ్చాత్యసంగీత పరిచయమువలన మరియొక లాభము కలిగినది. ఫిడేలు పాశ్చాత్యసంగీత వాద్యములందొకటి. ఇది పూర్వము మనదేశమునందుండెడి దను వాదమున్నది కాని అంతరించి పోయినది. దీక్షితుల కుటుంబమువారే మరల దానిని కర్ణాటక సంగీతమునకు ప్రక్క వాద్యముగా స్వీకరించి పుష్టినొందించిరి. శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కనిష్ఠసోదరుడు బాలస్వామి దీక్షితులు దానిని సాధన చేసి శ్రీ ముత్తుస్వామి దీక్షితుల వీణావాదనతో తుల్యముగ వాయింపగలిగెను. ఆనాడు ఫిడేలు కర్ణాటకసంగీత వ్యవసలో స్థానమును కల్పించుకొని నేటికి త్రోసివేయరానిదై సిరపడినది. ఉత్తరభారత హిందూస్థానీ సంగీతమున ఫిడేలునకీ స్థానములేదు.

దీక్షితుల కుటుంబము మణలి యందుండగా రామస్వామి దీక్షితులకు శ్రీవిద్యాగురువైన చిదంబరనాథ యోగీంద్రులు వచ్చుట జరిగెను. యోగీంద్రునకు రామస్వామి దీక్షితులు సకలోపచారములను చేసి సేవించెను. ఆయన కుమారులు (శ్రీ ముత్తుస్వామి దీక్షితులు, అతని సోదరులు) యోగీంద్రునకు నిరంతర శుశ్రూష చేసిరి. కొలదిదినములుండి చిదంబరనాథ యోగీంద్రుడు కాశీయాత్రకు బయలుదేరెను. దీక్షితుల కుటుంబమువారు సాష్టాంగ ప్రణామముచేసి ఆశీస్సు లరించిరి. యోగీంద్రుడు రామస్వామి దీక్షితులతో "నా కోరిక యొకటి తీర్చుము" అనెను. రామస్వామి దీక్షితులు "కోరిక ఏమి? మీరు ఆజ్ఞాపింపుడు, దేనినైనా చేయుదును" అని సమాధానము చెప్పెను. "అటైన నీ కుమారుడు ముత్తుస్వామి దీక్షితుని నా వెంట కాశీయాత్రకు పంపుము" అని యోగీంద్రుడు కోరెను.

రామస్వామి దీక్షితులు బాలుడైన జ్యేష్ఠపుత్రుని కాలినడకను కాశీయాత్రకు పంపుటకు భయపడెను. ఆదినములలో 'కాశీయాత్రకుపోయిన వారు కాటికి పోయినవారే" అన్న భావములు ప్రబలియున్నవి. దేశము నిరుపద్రవముగ లేదు. ప్రయాణము సులభముకాదు. రామస్వామి దీక్షితులు వెనుకాడగా వెంకటకృష్ణ మొదలియారు రామాయణకథలో దశరథ విశ్వామిత్రుల సంవాదమును గురుచేసి ఆ కథలో రామచంద్రునికి కల్యాణ లాభము కలిగినట్లు ఇక్కడకూడ శ్రీ ముత్తుస్వామి దీక్షితునికి మేలు చేకూరు నని ధైర్యము చెప్పెను. రామస్వామి దీక్షితులు తనకుమారుడు శ్రీ ముత్తుస్వామి దీక్షితుని చిదంబరనాథయోగీంద్రుని వెంట కాశీయాత్రకు పంపెను.

చిదంబరనాథ యోగీంద్రుడు ప్రసిద్ధుడు. ఆయనకు దేశమునందన్ని ప్రాంతములలో శిష్యులుండిరి. ఆయనతో సుఖముగా శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కాశీచేరెను. కాశీలో యోగీంద్రుడు శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు శ్రీవిద్యోపదేశము చేసెను. యోగాభ్యాసము చేయించెను. శ్రీ శంకర భగవత్పాదుల అద్వైతసిద్ధాంతగ్రంథములను శ్రవణము చేయించెను.

కాశీలో శ్రీ ముత్తుస్వామి దీక్షితుల దినచర్య కఠినవ్రతనిష్ఠగా జరిగినది. బ్రాహ్మీముహూర్తమున నిద్రలేచి, గంగాస్నానము చేసి, యోగాభ్యాసముచేసి, శ్రీదేవీ అర్చనచేసి శ్రీ యోగీంద్రులకడ వేదాంత శ్రవణముచేయవలెను. తరువాత శ్రీ విశ్వేశ్వర, విశాలాక్షీ, అన్నపూర్ణ దేవాలయములకు వెళ్లి దర్శనము చేసికొని రావలెను. అప్పుడు యోగీంద్రులు శ్రీచక్రార్చన చేయుచుండగా వేదము చెప్పుట, గానము చేయుట, వీణ వాయించుట చేయవలెను. సాయంత్రము మరల దేవాలయములకు వెళ్లి రావలయును. రాత్రి మరల యోగీంద్రుల శ్రీచక్రార్చనకాలమున వేద సంగీతములు, భజనలు. ఇట్లు కొన్ని సంవత్సరములు గడచెను.

కాశీలో వసించు కాలమున యోగీంద్రునితో కలసి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు ఉత్తరభారతమునయున్న పుణ్యక్షేత్రముల నన్నిటిని దర్శించినట్లు తోచుచున్నది. ఆయన కృతులలో కాశీదేవతలైన విశ్వేశ్వర, విశాలాక్షీ, అన్నపూర్ణా, కాలభైరవ, గంగాది మూర్తుల ప్రస్తుతి మాత్రమేగాక నేపాలు లోని పశుపతినాథుని ప్రస్తుతి - బదరిలోని నారాయణుని ప్రస్తుతి కన్పించుచున్నవి.

కాశిలో నుండగా శ్రీ ముత్తుస్వామి దీక్షితులు హిందూస్థానీ సంగీతము శ్రద్ధగా విని దానిలోని మెలకువలను అవగాహనచేసికొనెను.

ఆయన బృందావనసారంగ రాగమున రచించిన కృతులలో ('రంగపురవిహార', 'సౌందర్యరాజం', 'స్వామినాథేన') హిందూస్థానీ, బృందావనసారంగరాగ సంచారమే కలదు. ఇట్లే ఆయన రచించిన బహుకృతులలో ఆయనకున్న హిందూస్థానీ సంగీతజ్ఞానము వ్యక్తమగుచు దానివలన ఆయన కృతులలోని రాగసంచారము లెంత పుష్టిగానున్నవో విశదమగుచున్నది.

ఆయన కాశిలో అయిదారు సంవత్సరము లుండెను. ఒకనాడు చిదంబరనాథయోగీంద్రుడాయనను అన్నపూర్ణాంబికా దేవాలయమునకు తోడ్కొనిపోయి దేవికి పరిపూర్ణమైన అనుగ్రహము కలిగినదనియు, ఆమె శ్రీ ముత్తుస్వామి దీక్షితులను యావజ్జీవము కాపాడగలదనియు, తుదకు మోక్షముకూడ నీయగలదనియు చెప్పి బ్రతికియున్నంతకాల మామెను పూజించుచుండమని చెప్పెను.

మరునాడు ప్రాతఃకాలమున శ్రీ ముత్తుస్వామి దీక్షితులు గంగాస్నానమునకు బయలుదేరగా యోగీంద్రుడు "ముత్తుస్వామీ! మనము విడిపోవవలసిన సమయమాసన్నమైనది. నీకు స్వస్థలమునకుపోయి తల్లిదండ్రులను, సోదరులను చూడవలయునని లేదా?" అని ప్రశ్నించెను. "ఈ ముక్తిక్షేత్రమున దేవతాదర్శనము చేసికొనుచు తమ పాదసేవచేయుచునున్న నాకు మరేమియు జ్ఞాపకమునకు వచ్చుటలేదు" అని శ్రీ ముత్తుస్వామి దీక్షితులు సమాధానము చెప్పెను. యోగీంద్రుడు "మీ తండ్రి నిన్ను నావెంట పంపుటకే సమ్మతింపలేదు. ఇప్పుడు నీకొరకై యెంత పరితపించుచుండునో! నీవు వెంటనే వెళ్లి ఆయనకు కన్పించుట మంచిదికదా!" అని చెప్పి మరల "నీవు గంగానదిలో దిగినపుడు నీటిలో నాలుగైదు అడుగులను వేయుము. అక్కడ నీ కాలి కేమితగులునో దానిని తీసికొని రమ్ము" అని ఆనతి చేసెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితునికి గంగానదిలో వీణ దొరకినది. దానిపైన దేవనాగరిలో 'రామ' అనివ్రాసి యున్నది దాని 'యాలిముఖము' పైకి తిరిగి యున్నది. దానిని తెచ్చి యోగీంద్రుని కతడు సమర్పించెను.

యోగీంద్రుడా వీణను తన ఆశీస్సులతో మరల నాతనికి అనుగ్రహించి "ఇది నీకు గంగాదేవి అనుగ్రహించిన ప్రసాదము. నీవు గొప్ప వాగ్గేయ కారుడవు, వైణికుడవు కాగలవు" అని చెప్పెను. ఆమాటలే యోగీంద్రుని చివరిమాటలు. తరువాత వెంటనే అతడు గంగానదిలో మునిగి ప్రాణత్యాగముచేసెను. ఆయన దేహమును యితరుల సహాయ ముతో బయటకు తెచ్చి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు హనుమాన్ ఘట్టమున సమాధిచేసెను. గంగానది జలములలో లభించిన వీణ నేటికిని శ్రీ ముత్తు స్వామి దీక్షితులవారి వంశమున నున్నది.

గురువును పోగొట్టుకొనిన దుఃఖముతో శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కాశీనుండి స్వస్థలమునకు తిరిగివచ్చెను. ఆయన తిరిగి మణలి చేరు నప్పటికి ఆయన కుటుంబమువారు తిరిగి తిరువారూరు వెళ్లి యుండిరి. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తానుకూడ తిరువారూరునకు బయలుదేరెను. త్రోవలో తనకిష్టదేవమైన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దర్శనమునకు తిరుత్తని వెళ్లెను. అక్కడ చిన్నకొండపైన స్వామి ఆలయమున్నది.

ఆయన కొండ మెట్లెక్కి దేవాలయములోనికి వెళ్లి స్వామిని దర్శించుచుండగా "మా తండ్రి శ్రీ బాలాంబికాదేవిని మండలము దినములు అర్చించి సంతానమును పొందెను. నేనా దేవికుమారుడైన శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని మండలము దినము లర్చించి ఆధ్యాత్మికజ్ఞానమును పొందుట లెస్స" అను భావము కలిగెను. ఆయన నలుబది దినములు తిరుత్తనిలో స్వామిసన్నిధియందుండి సేవించుటకు, భజనచేయుటకు నిశ్చయించుకొనెను. షడక్షరీజపము చేయుచు, భజనచేయుచు శ్రీ స్వామి సన్నిధిని కూర్చుండి దినములు గడపెను.

నలుబదియవ దినమున దివ్యమైన సంఘటన జరిగెను. మధ్యాహ్నము దాటినది. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కన్నులు మూసికొని షడక్షరీ జపమును చేయుచుండెను. దర్శనమునకు వచ్చిన జనము పలుచబడిరి. ఒక వృద్ధుడు శ్రీ ముత్తుస్వామిని సమీపించి "ముత్తుస్వామీ! నోరు తెరువుము" అనెను. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కన్నులు తెరచి దివ్య తేజోమూర్తియైన వృద్ధబ్రాహ్మణుని చూచెను. "నే నీచోటుకు క్రొత్తవాడను. నాపేరీవృద్ధునకెట్లు తెలిసినదో" అని అనుకొనుచు నోరు

తెరచెను. వృద్ధుడు ఆయన నోట నేదియో పెట్టి "కన్నులు మూసికొని నీ నోటిలో నేను పెట్టిన దేమిటో చెప్పు" అనెను. కనులు మూసికొని "పటిక బెల్లము" అని శ్రీ ముత్తుస్వామి సమాధానము చెప్పి కనులు తెరచెను. అక్కడ వృద్ధబ్రాహ్మణుడు లేడు. శ్రీవల్లీదేవసేనా సమేతుడైన శ్రీ సుబ్రహ్మణ్యస్వామి తేజోమయాకృతిగా అతనికి దర్శన మిచ్చి ఆలయాంతర్భాగమునకు పోయినట్లుగా అదృశ్యమయ్యెను.

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి తన్ను జ్ఞానప్రసాదముతో అనుగ్రహించె నని, తనకు వృద్ధబ్రాహ్మణ రూపమున దర్శనమిచ్చెనని, తెలిసికొని శ్రీ ముత్తుస్వామి దీక్షితులు ఆనందపరవశుడై గొంతెత్తి కీర్తనలతో శ్రీ స్వామిని 'గురు గుహ' అనుచు ప్రస్తుతించెను. ఈ కీర్తనల వర్గమునకు గురుగుహ కీర్తనలని, తిరుత్తనికృతులని పేర్లు వచ్చినవి.

ఈ కీర్తనలలో "శ్రీనాథాది గురుగుహో జయతి జయతి" (మాయామాళవగౌళరాగమున) "మానస గురుగుహ రూపం భజరేరే" (ఆనందభైరవి రాగమున), "శ్రీ గురు గుహస్య దాసోహం నోచేత్ ।" (రాగపూర్వీ), "శ్రీ గురుణా" (పాడి రాగమున)' "గురుగుహాయ" (సామరాగమున), "గురుగుహాదన్యం" (బలహంసరాగమున) "గురు గుహస్వామిని" (భానుమతి రాగమున) "శ్రీ గురు గుహమూర్తే" (ఉదయ రవి చంద్రికా రాగమున) ప్రసిద్ధమైనవి. ఈ కృతులలోని పాడి, పూర్వీ, ఉదయరవిచంద్రికా రాగములకు ఈ కృతులే ఆధారములు. ఇందున్న భానుమతి రాగము అపూర్వరాగము మాత్రమేగాక వివాదిమేళనమునకు చెందినది కూడ. ఈ రాగసంచారమున వివాదిదోషము స్పృశించకుండ శ్రీ ముత్తుస్వామి దీక్షితులు జాగ్రత్త వహించెను.

ఈ కృతులను రచించునాటికి శ్రీ ముత్తుస్వామి దీక్షితుల వయస్సు 25 సంవత్సరములు. అప్పటికే ఆయన సంగీతసాహిత్యములందు పూర్ణ ప్రజ్ఞ గడించినట్లీకృతులు నిరూపించుచున్నవి. ఈ ఎనిమిది కృతులు ఎనిమిది విభక్తులందున్నవి. ఒక్కొక్క విభక్తియం దొక్క కృతిని రచించు టొక్క చమత్కారము. ఇట్టి ప్రక్రియ తెలుగుభాషలో ఉదాహరణ కావ్యములందు అవలంబింపబడుచున్నది. తెలుగుసాహిత్య

ముతో సమున్నత పరిచయమున్న శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తెలుగు ఉదాహరణకావ్యశిల్పమును అనుకరించెను.

ఉదాహరణకావ్యము అనగా భాషయందుకల సప్తవిధ విభక్తులను, సంబోధన విభక్తిని ఉదాహరించుచు స్తుతిరూపమున ఉండు లఘుకృతి. దీనియందు ఒక్కొక్క విభక్తికి కొక్కొక్క వృత్తము, కళిక, ఉత్కళిక, ఆవెనుక సార్వవిభక్తికక పద్యము, కవికృతినామాంకిత పద్యము ఉండును.

ఈ పై లక్షణములను గమనించి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు విభక్తి పరముగ కృతులను రచించినట్లు తోచుచున్నది. సంస్కృతమున ఉదాహరణకావ్యము లున్నవాయని పరిశీలింపగా పూర్వకాలమునాటి సంస్కృత ఉదాహరణకావ్యము లేవియు లభించుటలేదు. సంస్కృతమున లభించుచున్న నాలుగు ఉదాహరణములలో మొదటిది బసవోదాహరణము. దీనిని రచించినవాడు ప్రసిద్ధ ఆంధ్రకవి పాల్కురికి సోమనాథుడు. రెండవది తిరుమలార్య (ఈయనయు నాంధ్రుడే) కృత చిక్కదేవరాయోదాహరణము. మూడవది శివోదాహరణము రామయామాత్య విరచితము. ఈయన ఆంధ్రుడే. నాలుగవ ఉదాహరణమైన మల్లికార్జునస్తవోదాహరణమును రచించిన కాళీపట్టపు సిద్ధరామకవి తెలుగువాడే. ఉదాహరణ కావ్యలక్షణమును ప్రతాపరుద్రీయ మను సంస్కృత ఆలంకారిక గ్రంథమున ప్రవచించిన విద్యానాథుడు ఓరుగల్లువాడు. పై నాలుగు సంస్కృత ఉదాహరణకావ్యములును ఆంధ్రసాహిత్యమందున్న ఉదాహరణ లక్షణములను అనుసరించుచున్నవే.

తిరుత్తనినుండి ఉత్తరముగా తిరుపతి ఏబదిమైళ్ళ దూరము. శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి పూర్వీకుల గ్రామమైన విరించిపురమునకు తిరుపతి అరువదియైదుమైళ్ళ దూరమే. తిరుపతి వేంకటేశ్వరస్వామి శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి కుటుంబ దైవము. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కాశీలో నుండగా ఆయన సోదరుడు చిన్నస్వామి దీక్షితులకు నేత్రావరోధమురాగా, తండ్రి రామస్వామి దీక్షితు లతనిని తిరుమలకు తోడ్కొని పోయి శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శించి, సేవింపగా అతనికి మరల దృష్టి వచ్చినదట. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తిరుత్తనినుండి తిరుపతికి

వెళ్ళి శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించి వరాళి రాగమున "శేషాచల నాయకం భజామి" అను కీర్తన గానముచేసెను.

తిరుపతి నుండి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు ప్రసిద్ధ శైవ క్షేత్రమైన శ్రీకాళహస్తికి వెళ్ళెను. శ్రీకాళహస్తిలోని లింగము స్వాయంభువు. అది వాయులింగమని ప్రసిద్ధి. ఆకాశాది పంచభూతముల ప్రత్యేకాంశలతో పంచలింగ క్షేత్రము లున్నవి దక్షిణభారతమున. కాంచీపురమున వేంచేసి యున్న ఏకామ్రనాథుడు పృథ్వీలింగము. శ్రీరంగ సమీపముననున్న జంబుకేశ్వరములోని లింగము ఆపోలింగము. తిరువన్నామలైలోని అరుణాచలేశ్వరుడు తేజోలింగము. శ్రీకాళహస్తిలోని స్వామి వాయు లింగము. చిదంబరములోని శివలింగము ఆకాశలింగము.

శ్రీకాళహస్తిలో శ్రీ ముత్తుస్వామి దీక్షితులు మసేని రాగమున "శ్రీ కాళహస్తీశ" అను కృతిలో స్వామిని స్తుతించెను.

చిన్నతనముననే శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు తండ్రి వివాహము చేసెను. ఒక స్త్రీతో వివాహము కాదు. ఆయనకు యిద్దరు స్త్రీలతో వివాహము జరిగినది. కాని ఆయన జీవితాంతము గృహస్థాశ్రమ మందున్న మనస్సన్న్యాసివలె చరించెను. ఆయన జీవితమెల్ల దేవాలయములకు, దివ్య క్షేత్రములకు, తీర్థయాత్రలకు చేయుటతో సరిపోయినది. శివభక్తులైన నాయనార్లవలె, విష్ణుభక్తులైన ఆళ్వార్లవలె ఆయన క్షేత్రాటనము చేయుచు, తత్తద్దేవతా సంకీర్తనము చేయుచు కాలమును గడపెను. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లాయన సన్న్యాసియే. (అనాశ్రితః కర్మఫలం కార్యకర్మకరోతియః। సన్న్యాసీచ యోగీచ ననిరగ్నిర్నచా క్రియః॥ గీత ఆరవ అధ్యాయము. 1 వ శ్లోకము)

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కాంచీపురమున కొంతకాలముండి శ్రీ కామాక్షీదేవిని సేవించెను. ఏకామ్రేశ్వరుని సేవించెను. పెక్కు కృతులను రచించి గానముచేసెను. కామాక్షీదేవిని గురించి గానముచేసిన కృతులలో కమలామనోహరి రాగమున (వెంకటమఖి ప్రకారము మనోహరి రాగము) "కంజదళాయతాక్షి" అను కృతియు, హిందోళ రాగమున "నీరజాక్షి కామాక్షి" అను కృతియు, సరస్వతీమనోహరి రాగమున (వెంకటమఖి సిద్ధాంతము ప్రకారము) "సరస్వతీమనోహరి" అను

కృతియు, కర్నాటక శుద్ధసావేరి రాగమున "ఏకామ్రేశనాయకీ" అను కృతియు ప్రసిద్ధములు.

ఏకామ్రేశ్వరుని గురించి గానముచేసిన కృతులలో భైరవి రాగమున నున్న "చింతయ మాకంద" అను కృతియు, గమకక్రియ రాగముననున్న "ఏకామ్రనాథం భజేహం" అను కృతియు బహుళ ప్రచారమునందున్నవి. పంచభూత లింగములలో పృథ్వీలింగమును గురించి "చింతయ మాకంద" అను కృతి వర్ణించుచున్నది. ఈ కృతి పంచలింగకృతులలో నొకటి. కాంచీపురమునందున్న కైలాసనాథస్వామిపైకూడ శ్రీ ముత్తుస్వామి దీక్షితులు పెక్కుకృతులను రచించెను. అందులో వేగవాహిని రాగము నందున్న "కైలాసనాథం" అను కృతియు, కాంభోజి రాగమునందున్న "కైలాసనాథేన" అను కృతియు చెప్పతగినవి.

కాంచీపురముననున్న శ్రీ వరదరాజస్వామిని కూడ శ్రీ ముత్తుస్వామి దీక్షితులు సేవించి పెక్కుకీర్తనలతో ఆయనను ప్రస్తుతించెను. శ్రీ వరద రాజస్వామిపై రచించిన కీర్తనలలో సారంగ రాగముననున్న 'వరదరాజం ఉపాస్మహే" అను కృతి ప్రసిద్ధమైనది. శివభక్తులైన నాయనార్లవలె, విష్ణుభక్తులైన ఆళ్వార్లవలె ఆయన తీర్థయాత్రలుచేసి దేవతాసంకీర్తనముచేసి నప్పటికి వారివలె పరమతద్వేషము శ్రీ దీక్షితులకు లేదు. నాయనార్లు శివా లయములకు మాత్రమే వెళ్ళిరి. ఆళ్వార్లు విష్ణ్వాలయములకు మాత్రమే వెళ్ళిరి. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు శైవ, వైష్ణవ, దేవీ, సుబ్రహ్మణ్య, గణపతి ఆల యములన్నిటికి వెళ్ళెను. ఆయన విష్ణ్వీశభేద మెరుగని అద్వైతి. స్మార్త మతస్థుడు. శ్రీ శంకరభగవత్పాదమతావలంబి. శ్రీ ముత్తుస్వామి దీక్షితుల వారి కీర్తనలలో భక్తి, జ్ఞాన, వైరాగ్య భావముల సమ్మేళనము సమీచీన సుందరముగా నున్నది.

ఆకాలమున కాంచీపురమున ఉపనిషద్బ్రహ్మేంద్ర సరస్వతియను పరివ్రాజకాచార్యవర్యు డుండెడివాడు. ఆయన గొప్పవిద్వాంసుడు. ఉపనిషద్వ్యాఖ్యానములు రచించెను. ఆయన రామభక్తుడు. శ్రీ త్యాగ రాజు ఆయనవద్దనే రామ తారకమంత్రోపదేశమును పొందెనని సంప్రదాయ గాథ. ఆయన శ్రీరామచంద్రునిపై సంగీతరూపక మొకటి రచించెను. దానిపేరు "రామాష్టపది". జయదేవుని "గీతగోవిందము" వలె వ్రాయ

బడినదది. శ్రీ ముత్తుస్వామి దీక్షితుని ఉపనిషద్బ్రహ్మేంద్రస్వామి కాంచీపురమున తన మఠమునకు ఆహ్వానించెను. "రామాష్టపది"ని చూపి దానికి రాగ తాళాదులను నిర్ణయింపుమని కోరెను. శ్రీ ముత్తుస్వామి దీక్షితులాకార్యమును నిర్వహించెను అయితే ప్రస్తుతము "రామాష్టపది" లభించుటలేదు.

వేదాంతగ్రంథ అధ్యయనము చేయుటకై శ్రీ ముత్తుస్వామి దీక్షితులు ఉపనిషద్బ్రహ్మేంద్ర సరస్వతీస్వామిని అర్థించెను. ఆయన వేదాంత గ్రంథములు ప్రవచించుట మాత్రమే గాక శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు తీవ్రమైన రామభక్తిని కలిగించెను. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు శ్రీరాముని పై రచించిన కృతులలో నీ ప్రభావము ప్రస్ఫుటముగానున్నది. మాంజి రాగమున "రామచంద్రేన సంరక్షితోహం" అను కృతియందు శ్రీరాముడు త్రిమూర్తుల సమిష్టిరూపమని (రమా భారతీ గౌరీరమణ స్వరూపేణ రామ చంద్రేణ సంరక్షితోఽహం) వర్ణించెను. మాహురి రాగమున "మామవ రఘువీరా" అను కృతియందు శ్రీరాముడే పరబ్రహ్మమని శివాదులు చెప్పినట్లు (త్వామాహుశ్శివాదయస్త్వమితి) వర్ణించెను. శ్రీ త్యాగరాజస్వామి రచించిన "ఎవరని" అను కృతిలో చెప్పిన భావములవంటివే శ్రీ ముత్తుస్వామి దీక్షితుల భావములు. శ్రీరామ తారకమంత్రజపము మోక్షదాయకమని రామభక్తుల విశ్వాసము. మాహురిరాగ కృతిలో శ్రీ ముత్తుస్వామి దీక్షితులు శ్రీరాముని పామరపండిత పావనకర నామధేయుడని, గురుగుహ నుతుడని స్తుతించెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కాంచీపురమున దాదాపు నాలుగు సంవత్సరములు కాపురముండినట్లు పరంపరాగాథ. ఆతరువాత ఆయన తిరువారూరువకు వెళ్ళిపోయెను. త్రోవలో ఆయన తిరువన్నామలై చేరి పంచలింగ క్షేత్రమై, జ్యోతిర్లింగమైన అరుణాచలేశ్వరునికి నిలయమైన ఆ పుణ్యస్థలమున దేవతలను సేవించెను. శ్రీ అరుణాచలేశ్వరుని సారంగ రాగమున "అరుణాచలనాథం స్మరామి" అను కృతిలో ప్రస్తుతించెను.

తిరువన్నామలై క్షేత్రమునుండి శ్రీ ముత్తుస్వామిదీక్షితులు పంచలింగ క్షేత్రములలో ఆకాశలింగక్షేత్రమై ప్రసిద్ధపుణ్యక్షేత్రమైన చిదంబరమునకు వెళ్లెను. చిదంబరమున శివునకు నటరాజస్వామి యని పేరు.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు చిదంబర నటరాజస్వామివారిపైన చాల కృతులను రచించెను. ఈ కృతులలో మిక్కిలి ప్రసిద్ధమైనది కేదార రాగమున నున్న "ఆనందనటనప్రకాశం" అనునది. ఈ కృతి ఆనందనటన సంబంధమగుటచే ఔచిత్య రమణీయముగా నాట్యమునకు పనికివచ్చు సొల్లుకట్లు యీకృతికి అనుబంధముగా నున్నవి. ఇది యీ కృతియొక్క విశిష్టత, ప్రత్యేకత.

ఈ క్షేత్రమున శ్రీదేవి శివకామేశ్వరి. కల్యాణి రాగమున "శివకామేశ్వరీం" అను కృతిలో శ్రీ ముత్తుస్వామి దీక్షితు లీ దేవిని స్తుతించెను.

శ్రీ నటరాజస్వామి ఆలయము ప్రక్కనే విష్ణ్వాలయమొకటి కలదు. అక్కడ శ్రీ స్వామి పేరు గోవిందరాజస్వామి. ఈ స్వామిపైన శ్రీ ముత్తుస్వామి దీక్షితులు పెక్కు కృతులను రచించెను. వాటియందు అధికప్రచారమునందున్న ముఖారి రాగములో "గోవిందరాజం ఉపాస్మహే" అనునదియు, మేచబౌళి రాగమునందున్న "గోవిందరాజేన" అను కృతియు. ఈ రాగమున యీకృతియొక్కటే కర్ణాటక సంగీతసముద్రమున లభించుచున్నది. వేంకటమఖి రచించిన గీతములు మాత్రము కొన్ని కలవు. ఇటీవల 'దేవి దివ్య' అను కృతి యొకటి కూడ కన్పించుచున్నది.

చిదంబరము నుండి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు వైదీశ్వరన్ కోవెలకు వెళ్లెను. అక్కడనున్న దేవాలయ దేవతలపై పెక్కు కృతులను రచించి గానము చేసెను. అక్కడనున్న దేవాలయములలో ముఖ్యదేవతలు వైద్యనాథ, బాలాంబికా, ముత్తుకుమారస్వాములు. బాలాంబికాదేవిని గురించి వ్రాసిన కృతులలో అధిక ప్రచారమునందున్న కృతి "భజరేరే చిత్త బాలాంబికాం" అను కల్యాణిరాగకృతి. వైద్యనాథస్వామిపై రచించిన కృతులలో అఠాణ రాగమున రచింపబడిన "శ్రీ వైద్యనాథం" అనునది మిక్కిలి ప్రచారముననున్నది.

వైదీశ్వరన్ కోవెలనుండి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు మాయూరమునకు వెళ్లెను. ఆ గ్రామమున అతిపురాతన శివాలయ మున్నది. ఆ దేవాలయమున శ్రీ మయూరనాథస్వామి, అభయాంబ అధిష్ఠానదేవతలు. ఆ క్షేత్రమున శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కొలది మాసములు నివసించి ఆ దేవతలపై అనేకకృతులను రచించి గానముచేసెను. ఇందు ముఖ్యముగా

అభయాంబను గురించిన కృతులు రాగప్రస్తార సౌలభ్యమునందు మాత్రమే గాక తాంత్రిక విషయస్ఫురణమునందుకూడ గణ్యమైనవి. "అంబికాయాః అభయాంబికాయాః" అను కేదార రాగ కృతియందు కుండలినీశక్తిని జాగరితము చేయుటను గురించి యున్నవి. అభయాంబపై కృతులు అన్ని విభక్తులందును కలవు.

| | | | |
|---|---|---|---|
| 1. | 'అభయాంబ జగదాంబ' | కల్యాణి రాగం | ప్రథమావిభక్తి |
| 2. | ఆర్యామభయాంబాం | భైరవి రాగం | ద్వితీయావిభక్తి |
| 3. | గిరిజయా అపజయ | శంకరాభరణ రాగం | తృతీయావిభక్తి |
| 4. | అభయాంబికాయై | యదుకుల కాంభోజి రాగం | చతుర్థీవిభక్తి |
| 5. | అభయాంబికాయాః | కేదరగౌళ రాగం | పంచమీవిభక్తి |
| 6. | అంబికాయాః అభయాంబికాయాః | కేదార రాగం | షష్ఠీవిభక్తి |
| 7. | అభయాంబికాయాం | శహానా రాగం | సప్తమీవిభక్తి |
| 8. | దాక్షాయణి | తోడి రాగం | సంబోధన ప్రథమావిభక్తి |

ఈ కృతులకు తరువాత మంగళ హారతిగా పాడవలసిన ముగింపు కృతి 'శ్రీ అభయాంబ నిన్ను' అను తెలుగు పల్లవితో శ్రీరాగముననున్నది. ఈకృతిలో సంస్కృత, తమిళ భాషలుకూడ తరువాత వచ్చినవి. ఈకృతి మణిప్రవాళ శైలియందున్న కృతులలో ముఖ్యమైనది. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు రచించిన మణిప్రవాళశైలి కృతులలో మిక్కిలి ప్రసిద్ధమైన మరియొక కృతి "శ్రీ వేంకటాచలపతే నిన్నునమ్మితి" అను కాఫీరాగకృతి. ఈ మణిప్రవాళశైలి కృతులలో సంస్కృత, ఆంధ్ర, తమిళ భాషలను శ్రీ ముత్తుస్వామి దీక్షితులు ఉపయోగించినప్పటికి, ఆ మూడు భాషలలో తెలుగునే పల్లవికి ఉపయోగించియుండుటవలన కృతిలో రాగప్రస్తారమునకు, పల్లవికున్న ప్రాముఖ్య మెరిగినవారికి (రాగం-తానం-పల్లవి) శ్రీ ముత్తుస్వామిదీక్షితుల దృష్టిలో సహజ సంగీత మాధుర్య యుక్త ప్రవాహముగా తెలుగుభాషకే అధికయోగ్యత యున్నదని స్పష్టపడుచున్నది.

మాయూరమునుండి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తిరువారూరునకు చేరెను. అక్కడ ఆయన కీర్తి యిదివరకే వ్యాపించియున్నది. ఆయన తన కుటుంబమును మరల కలసికొని స్వగృహమున స్థిరపడెను. తిరువారూరున పెక్కు దేవతాయతనములు కలవు. అందు శ్రీ త్యాగరాజస్వామి ఆలయము బృహత్తరమై రమణీయశిల్పసంపన్నమైనది. ఆలయములో ఆవరణ దేవతల ఆలయము లున్నవి. బయట పెద్ద కోనేరున్నది. తిరువారూరులో శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తనకాలమును దేవాలయములకు వెళ్లి దేవతాదర్శనము చేసికొనుటలోను ఆ యా దేవతలపై కృతులను రచించి గానముచేయుటలోను గడపెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తిరువారూరులో వేంచేసియున్న శ్రీ త్యాగరాజస్వామి, శ్రీ కమలాంబ, శ్రీ నీలోత్పలాంబ, శ్రీ గణేశ, శ్రీ సుబ్రహ్మణ్యస్వాములపైన రచించిన కృతులు కర్ణాటకసంగీతమున ప్రసిద్ధముగా నున్నవి. తిరువారూరులో విజయపుర దేవాలయమున వేంచేసియున్న రేణుకాదేవిపై కన్నడ బంగాళ రాగమున కృతి యొకటి యున్నది. తమిళ శివభక్తులలో ప్రసిద్ధుడైన సుందరమూర్తి నాయనారుపైన తక్కా రాగమున కృతి యొకటి కలదు. అయితే శ్రీ త్యాగరాజస్వామివారిపై రచించిన కృతులే సంఖ్యాధికములు. అందు విభక్తి కృతులున్నవి. అవి,

| | | | |
|---|---|---|---|
| 1. | త్యాగరాజో విరాజతే | ఆఠాణ రాగం | ప్రథమా విభక్తి |
| 2. | త్యాగరాజం భజరే | యదుకులకాంభోజి రాగం | ద్వితీయా విభక్తి |
| 3. | త్యాగరాజేన సంరక్షితోఽహం | సాలగభైరవి రాగం | తృతీయా విభక్తి |
| 4. | త్యాగరాజాయ నమస్తే | బేగడ రాగం | చతుర్థీ విభక్తి |
| 5. | త్యాగరాజాదన్యం | దర్బారు రాగం | పంచమీ విభక్తి |
| 6. | శ్రీ త్యాగరాజస్య భక్తో | రుద్రప్రియ రాగం | షష్ఠీ విభక్తి |
| 7. | శ్రీ త్యాగరాజే కృత్యాకృత్యం | సారంగ రాగం | సప్తమీ విభక్తి |
| 8. | వీరవసంత త్యాగరాజ | వీరవసంత రాగం | సంబోధనా ప్రథమా విభక్తి |

శ్రీ త్యాగరాజస్వామిపై శ్రీ ముత్తుస్వామి దీక్షితుల రచనలు మరికొన్ని కలవు. అందు గౌళ రాగమున "శ్రీ త్యాగరాజ పాలయాశు మాం" అను కృతియు, ఆనందభైరవి రాగమున "త్యాగరాజ యోగ వైభవం" అను కృతియు, శ్రీ రాగమున "త్యాగరాజ మహాధ్వజారోహ" అను కృతియు ప్రసిద్ధములు.

శ్రీ త్యాగరాజస్వామి ఆలయ ఆవరణలో అయిదు శివలింగాలయము లున్నవి. ఆ శివమూర్తులపై శ్రీ ముత్తుస్వామి దీక్షితులు రచించిన కృతు లున్నవి. ఆ అయిదు కృతులు: భూపాల రాగమున అచలేశ్వరుని గురించి, బిలహరి రాగమున హాటకేశ్వరుని గురించి, కాంభోజి రాగమున వల్మీకేశ్వరుని గురించి, ఆనందభైరవి రాగమున ఆనందేశ్వరుని గురించి, నీలాంబరి రాగమున సిద్ధీశ్వరుని గురించి.

శ్రీ కమలాంబను గురించి రచించిన నవావరణకీర్తనలు జగత్ప్రసిద్ధములు. కర్ణాటకసంగీత సముద్రమునం దీ నవావరణకీర్తనలకు అత్యంత ప్రముఖస్థాన మున్నది. ఈ కీర్తనలలో శ్రీ ముత్తుస్వామి దీక్షితుల ప్రతిభ పతాకస్థాయియందున్నది. రాగస్వరూపము పండినదిగా నున్నది. ఈకీర్తనలు రాగదేవతలకు కట్టిన దేవాలయములవలె నున్నవి.

ఈకీర్తనలలో తంత్రవిద్యాభావములు, శ్రీ చక్రస్వరూప వర్ణనము, యంత్ర, తంత్ర, మంత్ర, పూజా, సాంకేతిక వైభవము ఉదాత్తస్థాయియం దున్నవి. ఈ నవావరణ కీర్తనలు మొత్తము పదునొకండు.

| | | |
|---|---|---|
| 1. కమలాంబికే | తోడి | ధ్యానకృతి |
| 2. కమలాంబా సంరక్షతు | ఆనందభైరవి | ప్రథమా విభక్తి |
| 3. కమలాంబాం భజరేరే | కల్యాణి | ద్వితీయా విభక్తి |
| 4. శ్రీ కమలాంబికయా | శంకరాభరణం | తృతీయా విభక్తి |
| 5. కమలాంబికాయై | కాంభోజి | చతుర్థీ విభక్తి |
| 6. కమలాంబికాయాః పరమ్ | భైరవి | పంచమీ విభక్తి |
| 7. కమలాంబికాయస్తవభక్తోహం | పున్నాగవరాళి | షష్ఠీ విభక్తి |
| 8. శ్రీ కమలాంబికాయాం భక్తిం కరోమి | శహాన | సప్తమీ విభక్తి |

| | | | |
|---|---|---|---|
| 9. | శ్రీ కమలాంబికే అవ అవ | ఘంటా | సంబోధన ప్రథమా విభక్తి |
| 10. | శ్రీ కమలాంబా జయతి | ఆహిరి | సార్వవిభక్తికము |
| 11. | శ్రీ కమలాంబికే | శ్రీరాగం | మంగళహారతి |

శ్రీ త్యాగరాజస్వామి ఆలయమున శ్రీ నీలోత్పలాంబ అను పేరుతో మరియొక అమ్మవారు కలదు. ప్రాంతీయగాథ ప్రకారము శ్రీ కమలాంబాదేవి అమ్మవారు శివుని పెండ్లాడుటకై తపస్సు చేయుచున్న స్థితిని చూపునది. వివాహమైన తరువాత రూపము శ్రీ నీలోత్పలాంబ. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు నీలోత్పలాంబను గురించి రచించిన కృతులలో విభక్తి కృతులెనిమిది ప్రసిద్ధముగా నున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1. | నీలోత్పలాంబ జయతి | నారాయణగౌళ | ప్రథమా విభక్తి |
| 2. | నీలోత్పలాంబాం భజరే | రీతిగౌళ | ద్వితీయా విభక్తి |
| 3. | నీలోత్పలాంబికయా | కన్నడగౌళ | తృతీయా విభక్తి |
| 4. | నీలోత్పలాంబికాయై | కేదారగౌళ | చతుర్థీ విభక్తి |
| 5. | నీలోత్పలాంబికాయాః | గౌళ | పంచమీ విభక్తి |
| 6. | నీలోత్పలాంబాయాస్తవ | మాయామాళవగౌళ | షష్ఠీ విభక్తి |
| 7. | నీలోత్పలాంబికాయాం | పూర్వగౌళ | సప్తమీ విభక్తి |
| 8. | శ్రీ నీలోత్పలాంబికే | ఛాయాగౌళ | సంబోధన ప్రథమా విభక్తి |

ఈ కృతులన్నియు గౌళవర్గరాగ కృతులు. ఈయన రచించిన రీతిగౌళరాగకృతి (నీలోత్పలాంబపైన) మరియొకటి కలదుగాని, అది యీ వర్గమునకు చెందినదికాదు.

శ్రీ త్యాగరాజస్వామి ఆలయమున గణపతికి చిన్న చిన్న ఆలయము లున్నవి. ఆగమసంప్రదాయమున భిన్న భిన్న మంత్రములతో, తాంత్రిక పూజాపద్ధతులతో, నామములతో గణపతికి భిన్నభిన్న మూర్తులు కలవు. ఇట్టివి మొత్తము పదునారు. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు గాణాపత్యమున (గణపతి పూజాసంబంధ ఆగమశాస్త్రము) నిష్ణాతుడు. ఆయన గణపతిని గురించి రచించిన కృతులలో హంసధ్వని రాగమున "వాతాపిగణపతిం" అను కృతియు, గౌళ రాగమున "శ్రీ మహాగణపతి రవతు మాం" అను

కృతియు, శ్రీరాగమున "శ్రీమూలాధారచక్ర వినాయక" అను కృతియు, మలహరి రాగమున "పంచమాతంగముఖ గణపతినా" అను కృతియు, సావేరి రాగమున "కరికలభముఖం" అనుకృతియు బహుళ ప్రచార మున నున్నవి.

తిరువారూరు దేవతలపై శ్రీ ముత్తుస్వామి దీక్షితులు రచించిన కృతులు ఆయన కృతులం దెక్కువ సంఖ్యలో నుండుటేగాక, ఎక్కువ శాస్త్ర ప్రగాఢత్వము కూడ కలిగియున్నవి.

ఆయన తిరువారూరునందు వసించుచున్న కాలమునందే స్వామిమలై, మన్నారుగుడి, నాగపట్టణము, తిరుచిరాపల్లి మొదలగు క్షేత్రములకు తీర్థయాత్ర చేసి వచ్చెను. ఆ స్థలములందున్న దేవతామూర్తులపై ఆయన కృతులను రచించి గానము చేసెను. స్వామిమలై క్షేత్రమున సుబ్రహ్మణ్యస్వామి ఆలయ మున్నది. శ్రీ సుబ్రహ్మణ్యస్వామికి దక్షిణ భారతమున ముఖ్యమైన ఆరు క్షేత్రములం దది యొకటి. స్వామిమలై సుబ్రహ్మణ్యస్వామిపై శ్రీ ముత్తుస్వామి దీక్షితులు పెక్కుకృతులను రచించెను. ఆ కృతులలో నాట రాగమున "స్వామినాథ" అను కృతియు, బిలహరి రాగమున "శ్రీ బాలసుబ్రహ్మణ్య" అను కృతియు అధిక ప్రచారమున నున్నవి.

మన్నారుగుడిలో ప్రసిద్ధమైన శ్రీకృష్ణదేవాలయమున్నది. ఆ స్వామి రాజగోపాలుడు. ఆయన "శ్రీ విద్యా రాజగోపాలు" డని పిలువబడును. తాంత్రికముగా శ్రీదేవీ అర్చనా విధానమైన శ్రీవిద్య, రాజగోపాలునికి కూడ సమన్వయింపబడుట చిత్రమైన విషయము. ఈ స్వామిపై ముత్తుస్వామి దీక్షితులు అనేక కృతులను రచించెను. అందులో సావేరి రాగమందలి "శ్రీ రాజగోపాల" అను కృతియు, జగన్మోహిని రాగమందలి "శ్రీ విద్యా రాజగోపాల" అను కృతియు ప్రచారమునందున్నవి.

నాగపట్టణమున ప్రసిద్ధమైన శివాలయ మున్నది. అందు స్వామి కాయారోహణస్వామి. అమ్మవారు నీలాయతాక్షి. ఆ క్షేత్రమున ప్రసిద్ధమైన విష్ణ్వాలయమున స్వామి శ్రీ సౌందరరాజు. ఈ దేవతలపై శ్రీ ముత్తుస్వామి దీక్షితులు చాల కృతులను రచించెను. అందు దేవగాంధార

రాగమున 'శాయారోహణేశం భజరే' అను కృతియు, నీలాంబరి రాగమున "అంబ, నీలాయతాక్షి" అను కృతియు, బృందావన సారంగ రాగమున "సౌందరరాజం ఆశ్రయే" అనుకృతియు ప్రసిద్ధములు.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు పుత్రసంతానము లేదు. కుమార్తె మాత్రమొకతె కలదు. ఆమెను తిరుచిరాపల్లిలో నిచ్చెను. అందుచేత ఆయన అనేకపర్యాయములు తిరుచిరాపల్లికి పోయెను. తిరుచిరాపల్లి లోని జంబుకేశ్వరము (తిరువానైక్కావల్) పంచలింగ క్షేత్రములం దొకటి. అచ్చటి లింగము అపోలింగము. ఆ స్వామిని స్తుతించుచు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు యమునాకల్యాణి రాగమున "జంబూపతే" అను కృతిని రచించెను. అది మిక్కిలి ప్రసిద్ధి పొందినది. అమ్మవారిపై బేగడ రాగమున "శ్రీ మాతృశ్శివవామాంకే" అను కృతిని రచించెను. శ్రీ మాతృభూతేశ్వరునిపై కన్నడ రాగమున "శ్రీ మాతృభూతం" అను కృతిని రచించెను.

శ్రీరంగమున శ్రీరంగనాథ, శ్రీరంగనాయకి స్తుతులుగా రచించిన కృతులలో నాయకి రాగమున "రంగనాయకం" అను కృతియు, మంగళ కైశికీరాగమున "శ్రీ భార్గవి" అను కృతియు ముఖ్యములు. అఖండ కావేరి తీర క్షేత్రములను పెక్కింటిని దర్శించి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు ఆ యా క్షేత్ర దేవతలపై కృతులను రచించెను. అందు ముఖారి రాగముననున్న "పాహిమాం రత్నాచలనాయక" అను కృతియు, కేదారగౌళ రాగమున నున్న "నీలకంఠం భజే" అను కృతియు విశేష ప్రచారమున నున్నవి.

తిరువారూరునకు సమీపక్షేత్రము కీవళూరు. ఇచ్చట వేంచేసియున్న శివుని పేరు అక్షయలింగస్వామి. ఒకనాడు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు శంకరాభరణ రాగమున "అక్షయలింగవిభో, స్వయంభో" అను కృతిని రచించి దానిని స్వామియెదుట గానముచేయుటకు కీవళూరువెళ్ళెను. ఈయన వెళ్ళునప్పటికి నిత్యపూజ పూర్తి అయినది. పూజారి గుడితలుపులు మూసి వెళ్ళిపోవుచుండెను. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు పూజారితో "అయ్యా, నేను స్వామి దర్శనమునకు తిరువారూరునుండి వచ్చితిని. దయచేసి తలుపు తెరచి, నాకు స్వామి దర్శనము లభింపనిండు" అని వేడుకొనెను. పూజారి "స్వామి ఎక్కడకు పోడు. రేపు దర్శనముచేయవచ్చును" అనిచెప్పి

పోవ నుద్యుక్తుడయ్యెను. అప్పటికే ముఖమంటపమున నిలబడి యున్న శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కృతిని పాడుట ప్రారంభించెను. అత్యంతమధురమైన ఆయన గాత్రమును విని గ్రామస్థులు చాలమంది గుమిగూడిరి. అది ఏదో తమాషాగా నుండుటవలన పూజారికూడ నిలుచుండి చూడదొడగెను. కృతిని పాడుట పూర్తి అగుచుండగా పరమాశ్చర్య కరముగా ఆలయము తలుపులు తెరచుకొన్నవి. శ్రీ ముత్తుస్వామి దీక్షితునికి స్వామిదర్శనము లభించినది. గ్రామస్థులు ఆశ్చర్యపడిరి. పూజారి పశ్చాత్తప్తుడై దీక్షితుని పాదములాశ్రయించి క్షమాపణ వేడెను. ఆయన పూజారిని మన్నించి స్వామి దర్శనమును తృప్తిగాచేసి, స్వగ్రామమునకు తిరిగివచ్చెను.

తిరువారూరు సమీపమున నున్న కళిక్కాడై గ్రామమునకు ఆ గ్రామ మిరాశీదారు వైద్యలింగ మొదలియారు ప్రార్థనను మన్నించి వెళ్ళి ఆ గ్రామమున వెంచేసియున్న విశ్వేశ్వరునిపై, విశాలాక్షీ, అన్నపూర్ణ అమ్మవార్లపై శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కృతులను రచించెను. అందు కాంభోజి రాగమున "కాశీవిశ్వేశ్వర" అను కృతియు, సామ రాగమున "అన్నపూర్ణే" అను కృతియు ప్రచారమునం దున్నవి. ఈకృతుల సంగీత వైదగ్ధ్యమునకు పరవశుడై మిరాశీదారు శ్రీ దీక్షితులకు కనకాభి షేకము చేసి గౌరవించి తనపై నొక కృతిని రచింపుమని కోరెను. ఆ అభ్యర్థనకు శ్రీ దీక్షితులు "అందువలన నీకు, నాకు క్షేమము కాదు. నిన్ను సంరక్షించుటకు భగవంతుని ప్రార్థించుట లెస్స" అని సమాధానము చెప్పి "శ్రీ విశ్వనాథం" అను రాగమాలికను రచించెను. ఈ రాగ మాలికలో 14 రాగము లున్నవి. ఇందు చివర 'వైద్యలింగ భూపాల రక్షక' డని సంబోధన యున్నది. ఈ రాగమాలిక బహు ప్రసిద్ధి పొందినది.

శ్రీ ముత్తుస్వామి దీక్షితుని కెప్పుడును సంపత్తులేదు. ఏదినమున కాదినము గడచుటకు కష్టమైన పరిస్థితులే. ఆయన గృహస్థజీవితమున అనుభవించిన ఆర్థికబాధలను గురించి పెక్కుగాథ లున్నవి.

ఒకనాడాయన యింటిలో వంటకు పదార్థమేమియు లేదు. ఇంటిలోనిస్త్రీల కేమియు తోచలేదు. ఆయన కా దైన్యస్థితిని చెప్పుటకు భయపడిరి. ఆసమయమున శ్రీ దీక్షితులు శిష్యులకు సంగీతపాఠములను నేర్పుచుండిరి. ఆ శిష్యులలో దేవరాని కమలమ్మ యున్నది. శ్రీ దీక్షితుల

భార్య కమలమ్మను లోనికి పిలిచి గృహములోని దైన్యస్థితిని చెప్పి "సాయమేదైన చేయగలవా ?" అని అడిగెను. కమలమ్మ "తల్లీ ! నీవు ఆందోళన పడవద్దు, నేనున్నాను. నా ఆభరణములను అమ్మి నా గురు స్వాములకు బాధలు కలుగకుండ సేవించుకుంటాను" అని సమాధానము చెప్పినది.

కమలమ్మ చెప్పిన మాటలు శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు విన్పించినవి. "శిష్యులకు నేను భోజనము పెట్టి విద్య నేర్పవలసినది పోయి, వారు నన్ను పోషింపవలసిన దుర్గతి నాకు పట్టినదా" అని ఆయన దుఃఖపడెను. కమలమ్మ బయటకు రాగా ఆయన "కమలా ! నీవేమిచేయుచున్నావు ? నీ ఆభరణము లమ్మి మాకెంతకాలము భోజనము పెట్టుదువు ? ఆ ధనము వ్యయమైపోయిన తర్వాత మా గతియేమి ? మమ్ము జీవితాంతకాలము పోషించుభారము నీవు వహింపగలవా ? అందరిని భరింపవలసినవాడు భగవంతుడు. నా హృదయమున నిజమైన భగవద్భక్తి యున్నదేని నన్నాయన విస్మరింపడు. నీ ఆభరణములను నాకై వినియోగించు దురవస నాకు రానీయడు" అని చెప్పి శ్రీ త్యాగరాజ స్వామి దేవాలయమునకు వెళ్ళి యదుకులకాంభోజి రాగమున "త్యాగరాజం భజరేరేచిత్త" అను కృతిని గానముచేసెను. ఆయన తిరిగి గృహమును చేరునప్పటికి రెండుబండ్లనిండ వస్తుసంభారము లాయన ఇల్లు చేరియుండెను.

విచారించగా తేలినదేమనగా ఆ వస్తుసంభారమును సత్రాధికారి ఒక రాజోద్యోగి తిరువారూరు మఠాము వచ్చునని సమకూర్చిపెట్టెను. ఆ రాజోద్యోగి వచ్చుటలేదని కబురందెను. ఆ వస్తుసంభారమును శ్రీ దీక్షితుల గృహమునకు పంపుట సద్వినియోగమని సత్రాధికారి అట్లు చేసెను. ఈ విషయ మెరిగిన తర్వాత సాలగభైరవి రాగమున "త్యాగరాజేన సంరక్షితోఽహం" అను కృతిని రచించి గానముచేసెను.

తనశిష్యురాలు దేవదాసి కమలమ్మ భరతనాట్యమున తొలివినికి (అరంగేట్రం, ప్రథమప్రదర్శనము) చేయుటకై క్రొత్తపాటలు కావలెనని కోరగా తోడి రాగమున త్యాగరాజస్వామిపై "రూపముజూచి" అను పదవర్ణమును, శ్రీరంజని రాగమున "నీసాటిదైవమెందులేదని" అను దరువును రచించి యిచ్చెను. ఈ రెండును తెలుగునందున్నవి. ఈకృతులను వినిన

పొన్నయ్య, వడివేలు, వారి సోదరులు చిన్నయ్య, శివానందం (వీరందరికి తంజావూరు సోదరులని పేరు) శ్రీ ముత్తుస్వామి దీక్షితులను దర్శించి తమ్ము శిష్యులనుగా చేసుకొమ్మని, తంజావూరు వచ్చి వసింపుమని కోరిరి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల శిష్యుడు శుద్ధమద్దళం తంబియప్ప శూల నొప్పిచే బాధపడుచుండెను. వైద్యమునకు నయముకాలేదు. గురు, శని గ్రహచారము బాగుండలేదని జ్యోతిష్కులు చెప్పిరి. ఆమాటలు శ్రీ దీక్షితులకు చెప్పగా గురుగ్రహముపై అఠాణ రాగమున "బృహస్పతే" అను కృతియు, శనిగ్రహముపై యదుకులకాంభోజి రాగమున "దివాకర తనూజం" అను కృతియు రచించి యిచ్చి వాటిని అనేకపర్యాయములు గానము చేయుమనెను. అత డా ప్రకారము చేయగా శూలనొప్పి పోయెను. శ్రీ దీక్షితులు మిగిలిన గ్రహములపై కూడ కృతులు వ్రాసెను. నవగ్రహ కీర్తనలు (వారకీర్తనలు) యిట్లేర్పడెను.

ఈకీర్తనలలో మొదటి ఏడును శూలాది సప్త తాళములలో నున్నవి. పల్లవిలో గ్రహముద్ర యున్నది. ఈకీర్తనలలో శ్రీ దీక్షితుల జ్యోతిషపాండిత్యము వేద్యమగుచున్నది. కర్ణాటక సంగీతమున లయ మాధుర్యము శూలాదిసప్తతాళోపరినిర్మిత సౌధము. ధ్రువాది సప్త తాళములకు శూలాదితాళములని పేరు.

సూర్యగ్రహమును గురించి 'సూర్య మూర్తే' అను కీర్తన
సౌరాష్ట్ర రాగమున-ధ్రువతాళము

చంద్రగ్రహమును గురించి 'చంద్రం భజ' అను కీర్తన
అసావేరి రాగమున-మఠ్యతాళము

కుజగ్రహమును గురించి 'అంగారకం' అను కీర్తన
సురటి రాగమున-రూపకతాళము

బుధగ్రహమును గురించి 'బుధమాశ్రయామి' అను కీర్తన
నాటకురంజి రాగమున-ఝంపకతాళము

గురుగ్రహమును గురించి 'బృహస్పతే' అను కీర్తన
అఠాణ రాగమున-త్రిపుటతాళము

శుక్రగ్రహమును గురించి 'శ్రీ శుక్ర భగవంతం' అను కీర్తన
ఫరజు రాగమున-అటతాళము

శనిగ్రహము గురించి 'దివాకరతనూజం' అను కీర్తన
యదుకులకాంభోజి-ఏకతాళము

రాహుగ్రహమును గురించి 'స్మరామ్యహం' అను కీర్తన
రామమనోహర రాగమున

కేతుగ్రహమును గురించి 'మహాసురం' అను కీర్తన - చామర రాగమున

శ్రీ దీక్షితులకు క్రీ. శ. 1827 లో తల్లితండ్రులు గతించిరి. కొందరు పెద్దలు మధురలో వసింపుమని కోరిరి. తనతమ్ములు చిన్నస్వామి, బాలస్వామి దీక్షితులను మధురకు పంపెను. తంజావూరు సోదరులు మరల మరల ప్రార్థింపగా తాను తంజావూరు వెళ్లి అక్కడ నివసించెను.

తంజావూరునందుండగా ఆయన తరచు శ్రీ శ్యామశాస్త్రిగారిని కలుసుకొనుట జరిగెడిది. ఇరువురకు స్నేహము దృఢమైనది. శ్రీ శ్యామ శాస్త్రి కుమారుడు సుబ్బరాయశాస్త్రి శ్రీ దీక్షితులకడ శిష్యుడై సంగీతము నేర్చుకొనెను. శ్రీ దీక్షితుల తండ్రి రామస్వామి దీక్షితులు రచించిన (శ్రీ రంజని రాగములో) చౌక వర్ణము (స్వామి, నిన్నేకోరి) యొక్క చరణము నశించగా శ్రీ శ్యామశాస్త్రి స్వరగతిలో ద్వితీయావృత్తి రచించెను. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తృతీయమును, చిన్నస్వామి దీక్షితులు చతుర్థమును రచించిరి.

తంజావూరులో వేంచేసియున్న బృహదీశ్వర, బృహన్నాయకి అమ్మ వార్లపై శ్రీ దీక్షితులు పెక్కు కీర్తనలను రచించి గానము చేసెను.

శ్రీ దీక్షితులు తంజావూరునందున్న కాలమున తిరువైయారు వెళ్ళి సంగీతజగద్గురువైన శ్రీ త్యాగరాజును దర్శించినట్లు పరంపరాగాథ కలదు. శ్రీ దీక్షితులు తిరువైయారు వెళ్లి శ్రీ ధర్మసంవర్ధనీఅమ్మవారి ఆలయమున అమ్మవారి కెదురుగా కూర్చుండి మధ్యమావతి రాగమున "ధర్మసంవర్ధని" అను కృతి గానము చేయుచుండగా శ్రీ త్యాగరాజు శిష్యులు వినుట తటస్థించి ఆయనను తమ గురువు గృహమునకు ఆహ్వానించిరి. శ్రీ దీక్షితులు

వారివెంట శిష్యసహితుడై వెళ్ళెను. ఆదినము శ్రీ త్యాగరాజు గృహమున రామాయణ పారాయణ సమాప్తి సందర్భముగా విశేషపూజ జరుగుచుండెను. శ్రీ దీక్షితులకు శ్రీ త్యాగరాజు సాదరమైన స్వాగతము చెప్పి గౌరవించెను. శ్రీ దీక్షితులు శ్రీ త్యాగరాజునకు వినయముగా ప్రతిగౌరవము చూపెను.

ఆసందర్భమున శ్రీ త్యాగరాజు, అయన శిష్యులు భైరవి రాగమున "కొలువై యున్నాడే" అను కృతిని గానము చేసిరి. శ్రీ త్యాగరాజు కోరగా శ్రీ దీక్షితులు, ఆయన శిష్యులు మణిరంగు రాగమున "మామవ పట్టాభిరామ" అను కీర్తనను పాడిరి. సంగీతసార్వభౌములైన వారిద్దరి గానమును విని జనులు పరవశులై తరించిరి. శ్రీ త్యాగరాజులవారియింట సంతర్పణము తరువాత శ్రీ దీక్షితులు తంజావూరు వెళ్ళెను.

ఈ యిరువురు మహాత్ములను గురించి మరియొకగాథ యున్నది. క్రీ. శ. 1844 లో (శ్రీ ముత్తుస్వామి దీక్షితులు విదేహముక్తులైన తరువాత పదిసంవత్సరములకు) బాలస్వామి దీక్షితుల దత్తపుత్రుడు సుబ్బరామ దీక్షితులు (దౌహిత్రుడే) ఏడేండ్లవాడు బంధువులతో కలసి శ్రీ త్యాగరాజు దర్శనము చేసి ప్రణామము చేసెను. ఆ పిల్లవాడు ఫలానాయని బంధువులు శ్రీ త్యాగరాజునకు చెప్పిరి. శ్రీ త్యాగరాజు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు మహనీయుడని, ఆయన దివ్యస్మృతి చేసి కన్నీరుకార్చి, బాలునికి పటికబెల్లము పెట్టెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల తంజావూరు నివాసమును గురించి పెక్కుగాథలున్నవి. తంజావూరు రాజు శరభోజి శ్రీ శ్యామశాస్త్రి దర్శనమునకు వచ్చి పోవుచుండెడువాడు. శ్రీ శ్యామశాస్త్రి భార్యతో శ్రీ ముత్తుస్వామి దీక్షితుల భార్యలిద్దరకు పరిచయమున్నది. శ్రీ దీక్షితుల భార్యలలో పెద్ద ఆమెకే ఏకసంతానము. ఒక పుత్రిక. రెండవ భార్యకు సంతానములేదు. పెద్దభార్య నల్లగా నుండెడిదట. చిన్నభార్య బహురూపవతి. శ్రీ శ్యామశాస్త్రిభార్య శ్రీ దీక్షితుల భార్యలతో "శరభోజిరాజు మావారితో ప్రసంగవశాత్తు మీ భర్తను గురించి అమిత

గౌరవముగా మాట్లాడెనట. ఒకసారి మీ భర్త రాజదర్శనము చేసినచో మీకు కొరత వుండదు. సర్వాభరణములు లభించును" అనినది.

శ్రీ దీక్షితుల చిన్నభార్య భర్తతో "రాజునకు మీపై మహా గౌరవమట. ఒకపర్యాయము చూడరాదా? మనకు కొరత ఉండదు. మాకు కోరికలు తీరునట్లు ఆభరణములు లభించును" అన్నది. రాజును తానే స్వయముగా చూచుటకు పోయినచో ఆయనపై కృతి వ్రాసుకొని పోవలెను. అది శ్రీ దీక్షితులు చేయలేదు. ఆయన అశాంతిపడెను. శ్రీ దీక్షితులు లలిత రాగమున శ్రీసూక్తభావముతో "హిరణ్మయీం లక్ష్మీం సదా భజామి। హీన మానవాశ్రయం త్యజామి। స్థిరతరసంపత్ప్రదామ్।" అను కీర్తనతో లక్ష్మీదేవిని స్తుతించెను. ఆరాత్రి శ్రీమహాలక్ష్మి సకలాభరణభూషితయై శ్రీ దీక్షితుల చిన్నభార్యకు స్వప్నదర్శనమిచ్చి అనుగ్రహించెను. ఆమె నిద్రలేచి భర్తకు స్వప్నవృత్తాంతము చెప్పి తనకు ఆభరణముల పిచ్చి పోయినదని, తన్ను మన్నింపుమని చెప్పెను. శ్రీ దీక్షితులు మరల లక్ష్మీదేవిని ధన్యాసి రాగమున "మంగళదేవతయా, త్వయా బహుమానితోఽహమ్" అను కృతితో కృతజ్ఞత చెప్పుకొనెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు మధురలో తన తమ్ముడు చిన్నస్వామి దీక్షితులు మరణించినట్లు తెలిసినది. రెండవ తమ్ముడైన బాలస్వామి దీక్షితుని చూడవలెనని దేవూరు సుబ్రహ్మణ్య మను శిష్యునితో మధురకు వెళ్లెను. త్రోవలో వేగవతీనదీతటమున (వైగై) వినాయకుని బిలహరి రాగమున "ఏకదంతం భజేహం" అను కృతితో గానము చేసెను. మీనాక్షి ఆలయమును చేరి వరాళి రాగమున "మామవ మీనాక్షి" అను కృతి గానము చేసెను. అర్చకులవలన తనతమ్ముడు బాలస్వామి దీక్షితులు రామేశ్వరము వెళ్లినట్లు తెలిసికొనెను. కొన్ని దినములు మధురలో గడపెను. మధురలో శ్రీ మీనాక్షిదేవిపై అనేకకృతులను రచించెను. అందు గమకక్రియ రాగమున "మీనాక్షి మేముదం దేహి" అను కృతియు, వరాళి రాగమున "మామవ మీనాక్షి" అను కృతియు, మోహన రాగమున "కాదంబరీ ప్రియాయై" అను కృతియు, గౌరి రాగమున "శ్రీమీనాక్షి గౌరి" అను కృతియు ప్రసిద్ధములు. ఇవిగాక శ్రీ మీనాక్షిపైన ఎనిమిది భక్తి కీర్తనలు

రచించెను. అందు దేవక్రియ రాగమున "మధురాంబా సంరక్షతు" అను కృతియు, అఠాణా రాగమున "మధురాంబాయ" అను కృతియు, దేవగాంధారి రాగమున "శ్రీ మీనాక్షీకాయాః" అను కృతియు, బేగడ రాగమున "మధురాంబికాయా స్తవ" అను కృతియు మిక్కిలి ప్రచారమునందున్నవి.

శ్రీ సుందరేశ్వరునిపై శ్రీ దీక్షితులు రచించిన కృతులలో శుద్ధవసంత రాగమున "సోమసుందరేశ్వరం" అను కృతియు, కన్నడ రాగమున "పాలయమాం పార్వతీశ" అను కృతియు ప్రసిద్ధములు. ఇందు శుద్ధవసంత రాగము అపూర్వ రాగము. ఇవిగాక శంకరాభరణరాగమందున్న "సుందరేశ్వరాయ" అను కృతియు, దర్బారు రాగమందున్న "హాలాస్యనాథం" అను కృతియు కొంత ప్రచారమందున్నవి. మధుర సమీపమందున్న పువ్వవనీశ్వరునిపై సౌవీర రాగమున రచించిన "సారససౌవీర" అను కృతి ప్రసిద్ధమైనది. ఇదియు అపూర్వరాగకృతి.

మధురనుండి శ్రీ దీక్షితులు రామేశ్వరయాత్రకు బయలుదేరెను. త్రోవలో అలగర్ కోవెల్ క్షేత్రమున శ్రీ సుందరరాజస్వామిపై ప్రసిద్ధమైన రామక్రియ (కామవర్ధని) రాగమున "శ్రీ సుందరరాజం" అను కృతిని గానము చేసెను.

రామేశ్వరమున రామక్రియ రాగమున "రామనాథం భజేహం" అను కృతి గానముచేసెను. దర్భశయనమున అపూర్వమైన నారాయణగౌళ రాగమున "శ్రీరామం రవికులాబ్ధి సోమం" అను కృతి గానము చేసెను. రామేశ్వరమున తనతమ్ముడు బాలస్వామి దీక్షితులను గురించి వార్తలు తెలిసికొనెను. బాలస్వామి దీక్షితులకు రామేశ్వరమున ఎట్టయపురము రాజుతో పరిచయ మేర్పడినదట. ఆరాజు ఆహ్వానముపై అతడు ఎట్టయపురము వెళ్లి అక్కడ రాజాస్థానమున సంగీత విద్వాంసుడుగా నుండెనట. శ్రీ దీక్షితులు ఎట్టయపురమునకు బయలుదేరెను.

త్రోవలో సాత్తూరులోనున్న శ్రీ వేంకటేశ్వరునిపై మేఘరంజని రాగమున "శ్రీ వేంకటేశ్వర యాదవ భూపతిం ఆశ్రయేఽహం" అను కృతి గానము చేసెను.

ఎట్టయపురమునకు పోవు త్రోవలో వర్షములు లేక క్షామపరిస్థితు లున్న ప్రాంతములనుండి ప్రయాణము చేయవలసివచ్చినది. అక్కడ శ్రీ దీక్షితుల భార్యలయందొక ఆమెకు అమితదాహమై, నీరులేక శోష గిల్లినది. శ్రీ దీక్షితులు అమృతవర్షిణి రాగమున "ఆనందామృతకర్షిణి, అమృతవర్షిణి హరాది పూజితే శివే భవాని ...సలిలం వర్షయ వర్షయ" అను కృతిని గానము చేయగా వెంటనే పెద్దవర్షము కురిసెనట. శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి వెంటనున్న వారు తేరుకొనిరట.

వర్షమువలన ప్రయాణము చాలాసేపు నిలచిపోయినది. కొందరు వైష్ణవులు శ్రీ దీక్షితుల బృందమును జాగ్రత్తగ ఎట్టయపురము చేర్చిరి. అక్కడ శ్రీ దీక్షితులకు గొప్ప స్వాగత సత్కారములు జరిగినవి. అన్న దమ్ములు కలుసుకొనిరి. బాలస్వామి దీక్షితునికి వివాహము జరిగినది. ఎట్టయపురము రాజు ప్రార్థనను మన్నించి శ్రీ ముత్తుస్వామి దీక్షితులు అచ్చటనే వసించుటకు అంగీకరించి, తిరువారూరు వెళ్లి అక్కడ తనసామానులను తెచ్చుకొనెను.

శ్రీ దీక్షితులు ఎట్టయపురముననున్న దినములలో తిరుచందూరు వెళ్లి శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని దర్శించి "మయూరాధిరూఢం" అను ప్రసిద్ధ శ్లోకమును గానము చేసెను. ఈస్వామిపై రచించిన కృతులలో తోడి రాగమున "శ్రీ సుబ్రహ్మణ్య మాం రక్షతు" అను కృతి ప్రసిద్ధము.

ఈకాలముననే శుద్ధధన్యాసి రాగమున "శ్రీ సుబ్రహ్మణ్యేన రక్షితోఽహం" అను కృతిని కంకశైల సుబ్రహ్మణ్యస్వామిపై రచించెను. తిరునల్వేలిలోని శాలివాటీశ్వరునిపై దేవగాంధారి రాగమున "శాలి వాటీశ్వరం" అను కృతియు, కాంతిమతీదేవిపై సింహారవ రాగమున "శ్రీకాంతిమతీం" అను కృతియు రచించెను. కల్లడకురిచ్చిలోని శ్రీలక్ష్మీ వరహాస్వామిపై నొక కృతి రచించెను.

పశ్చిమ కనుమలలోని 'శబరిమలై' కొండపై వేంచేసియున్న అయ్యప్ప దర్శనముచేసి శ్రీ దీక్షితులు వసంత రాగమున "హరిహరపుత్ర" అను కృతి గానచేముసెను. గురువాయూరు వెళ్లి అక్కడ వేంచేసియున్న

శ్రీకృష్ణునిపై తోడి రాగమున "శ్రీకృష్ణం భజ మానస" అను కృతిని గానముచేసెను.

ఎట్టయపురమున శ్రీ దీక్షితులు నివసించిన యింటికి సమీపముగా నున్న గృహములలో నొకదానియందు ప్రసిద్ధ తమిళకవి సుబ్రహ్మణ్య భారతియు, మరొకదానియందు హృషీకేశ శివానందసరస్వతియు జన్మించిరి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కృతులలో గోపుచ్ఛ 'స్రోతోవాహ' యతి నిర్మాణము ప్రత్యేకముగా చెప్పవలసియున్నది.

శ్రీరాగ కృతి "శ్రీ వరలక్ష్మి నమామ్యహం" అను దానియందు, గోపుచ్ఛయతి నిర్మాణమున్నది. "శ్రీ సారసపదే, రసపదే, సపదే, పదే" అని యీకృతియందు వచ్చును. ఇది గోపుచ్ఛయతి నిర్మాణము. పూర్ణచంద్ర బింబ అను రాగమాలిక చివరలో "నాగధ్వనిసహితే, ధ్వనిసహితే, సహితే, హితే, తే" అని మరియొక ఉదాహరణము. ఆనందభైరవి రాగమున "త్యాగరాజయోగ వైభవం" అను కృతియందు "త్యాగరాజయోగ వైభవం, అగరాజయోగ వైభవం, రాజయోగ వైభవం, యోగ వైభవం, వైభవం, భవం, వం" అను నదియు, "మామవ పట్టాభిరామ" ... 

"మాయేత్వంయాహి" అను కృతిలో "సరసకాయే, రసకాయే, సకాయే, ఆయే" అనునదియు ఉదాహరణములు.

స్రోతోవాహయతి నిర్మాణమునకు "త్యాగరాజయోగ వైభవం" అను కృతిలో, అనుపల్లవిలో "శివశక్త్యాది సకలతత్త్వ స్వరూపప్రకాశం" అను చోట "స్రోతోవాహయతి—శం, ప్రకాశం, స్వరూపప్రకాశం, తత్త్వస్వరూప ప్రకాశం, సకలతత్త్వ స్వరూప ప్రకాశం, శివశక్త్యాది సకల తత్త్వ స్వరూప ప్రకాశం" అని కలదు.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు పురుషసంతు లేదు. కుమార్తె వంశమును గురించి వివరములు తెలియవు. ఆయన తమ్ముడు బాలస్వామి దీక్షితుడు తన దౌహిత్రుడైన సుబ్బరామదీక్షితుని దత్తు చేసుకొనెను. ఇతడు ప్రసిద్ధ వాగ్గేయకారుడు (1839-1906) ఆయన కుమారుడు అంబి దీక్షితులు (ఉరఫ్ ముత్తుస్వామి దీక్షితులు). ఈయన కుమారుడు బాలస్వామి దీక్షితులు నేటికియున్న దీక్షితుల కుటుంబములోనివాడు.

ఆయన శిష్యులలో ప్రసిద్ధులు చాలమంది కలరు. ఆయన తమ్ములు చిన్నస్వామి దీక్షితులు, బాలస్వామి దీక్షితులు ఆయన శిష్యులే. తమిళ విద్వాంసుడు, ప్రసిద్ధగాయకుడు తిరుక్కడైయూరు భారతియు, ప్రసిద్ధ వైణిక విద్వాంసుడు అవుడయార్కోవెల్ వీణ వెంకటరామయ్యరు, గొప్ప గాయకుడు తేవూరు సుబ్రహ్మణ్యయ్యరు, శుద్ధమద్దళంవాద్యనిపుణుడు శుద్ధమద్దళం తంబియప్ప, భరతనాట్య ప్రవీణుడు కొరనాడు రామస్వామి, ప్రసిద్ధ నాగస్వర విద్వాంసుడు తిరువమందూరు బిల్వవనం, కొన్ని తాన వర్ణములు, పదవర్ణములు రచించిన తిరువారూరు అయ్యాస్వామి నట్టువరార్, ప్రసిద్ధ తంజావూరు సోదరులు పొన్నయ్య, చిన్నయ్య, శివానందం, వడివేలు, దేవదాసి తిరువారూరు కమలమ్మ. సంగీతగాయకి వళలార్కోయిల్ అమ్మణి మొదలగువారు ఆయన శిష్యులలో ముఖ్యులు.

క్రీ. శ. 1835 సంవత్సరమున ఆశ్వయుజ బహుళ చతుర్దశి దినము, నరకచతుర్దశి. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు మామూలుగా నిద్రలేచి ప్రాతఃకాలసంధ్యాదులను నిర్వర్తించి అనుష్ఠానము ప్రారంభింపబోవు చుండగా ఎట్టయపురరాజు వచ్చి భయాందోళితమానసుడై దర్శనము కోరెను. శ్రీ దీక్షితులు "ఏమి ఆందోళన" అని ప్రశ్నింపగా "గాంగేయుడను పేరుగల నా భద్రగజము ఉన్మత్తమై గజశాలనుండి కట్లుతెంపుకొని శ్మశానవాటికకు పోయి నిలబడి ఘీంకరించుచున్నది. ఎవరిని దగ్గరకు రానీయుటలేదు. ఇది అశుభసూచకముగా భయపడుచున్నాను" అని విన్నవించెను. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కనులు మూసికొని క్షణ మాలోచించి మరల తెరచి "రాజా! నీ కుటుంబమున కే యుపద్రవమును లేదు" అనిచెప్పి రాజును పంపెను. రాజు భయమును వదలి ప్రాసాదము చేరుకొనెను.

అనుష్ఠానము ప్రారంభించుచుండగా శ్రీ అన్నపూర్ణాదేవి తేజోదర్శన మైనది. ఆయనకేదో అవగతమైనది. నవావరణాది పూజలు నిర్వర్తించి పున్నాగవరాళి రాగమున 'ఏహి అన్నపూర్ణే సన్నిధేహి, సదాపూర్ణే,

సువర్ణే, చిదానందవిలాసిని” అను కృతి గానము చేసెను. ఇది ఆయన ఆఖరి కీర్తన.

శిష్యులను పిలచి “మీనాక్షీ మేముదం దేహి” (గమకక్రియరాగము) అను కృతిని పాడు డనెను. కీర్తన పూర్తిగా మరల పాడు డనెను. అనుపల్లవిలోని “మీనలోచనన, పాశమోచని” అను పదములు రాగా ఆయన చేతులు జోడించి, కనులు మూసికొని “శివే, పాహి” అనుచు బ్రహ్మరంధ్రమును భేదించుకొని విముక్తుడాయెను. తరువాత గాంగేయభద్ర గజము శాంతించి, తానంతట తానే గజశాలకు తిరిగివచ్చినది. శ్రీ దీక్షితుల సిద్ధి వార్త ఎట్టయపురమును దుఃఖసాగరమున ముంచినది. ఎట్టయపురరాజు మిక్కిలి దుఃఖించెను. ఆయన సకల రాజమర్యాదలతో శ్రీ దీక్షితుల కళేబరమునకు దహన సంస్కారములు చేయించెను. దహనసంస్కారము జరిగినచోట బృందావనము నిర్మింపబడి నేటికిని దర్శనీయముగా నున్నది.

రాక్షస ఆషాఢ
శు. తృతీయా శుక్రవారం
11-7-1975
మదరాసు-33

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు



తిరుత్తణి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి



శ్రీ దీక్షితులవారి జన్మస్థానమైన తిరువారూరులో వారి సమాధి



శ్రీ దీక్షితులవారి వీణ

( వీణ తలభాగము పైకి తిరిగియుండుట గమనించతగినది )

# శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కృతులు

## I. తిరుత్తణి కీర్తనలు

### 1

మాయామాళవగౌళ రాగము - ఆది తాళము

ప. శ్రీనాథాది గురుగుహో జయతి జయతి
శ్రీచిదానందనాథోఽహమితి సంతతం
హృది భజామి ॥ శ్రీనాథ

అ. నానాప్రపంచవిచిత్రకరో
నామరూపప్రపంచభూతాకరో
అజ్ఞానధ్వాంతప్రచండభాస్కరో
జ్ఞానప్రదాయకో మహేశ్వరో
దీనజనోద్ధరణదివ్యతరో
దివ్యౌఘాది సకలదేహధరో
మానసానందకర చతురతరో
మద్గురువరో మంగళం కరోతు ॥ శ్రీనా

చ. మాయామయ విశ్వాధిష్ఠానో
మాతృకాది మతానుష్ఠానో
మాలినీ మండలాంతవిధానో
మంత్రాద్యజపాహంసధ్యానో

మాయాకార్యకలనాహీనో
మామకసహస్రకమలాసీనో
మాధుర్యగానామృతపానో
మాధవాద్యభయ వరప్రదానో
మాయాశబలిత బ్రహ్మరూపో
మారకోటి సుందరస్వరూపో ॥శ్రీనా
మతిమతాం హృదయగోపురదీపో
మత్తశూరాది జయప్రతాపో
మాయామాళవగౌళాదిదేశ మహీపతిపూజిత పదప్రదేశ
మాధవాద్యమరబృందప్రకాశ
మహేశస్య మహార్థోపదేశ ॥శ్రీనా

## 2

ఆనందభైరవి - తిస్రఏక తాళము

ప. మానస గురుగుహరూపం భజరేరే
మాయామయ హృత్తాపం త్యజరేరే
అ. మానవజన్మని సంప్రాప్తే సతి
పరమాత్మని నిరతిశయసుఖం వ్రజరేరే ॥
చ. సత్వగుణోపాధిసహిత సదాశివం
స్వావిద్యాసమేత జీవోద్భవం
తత్వం తామసయుత విశ్వవైభవం
తారకేశ్వర మానందభైరవం

నత్వా శ్రీ గురుచరణం
కృత్వా నామస్మరణం
జిత్వా మోహావరణం
మత్వా త్వదేకశరణం ॥మానసగురు

## 3

పాడి రాగము - రూపక తాళము

ప. శ్రీ గురుణా పాలితోఽస్మి సచ్చిదానందనాథేన ॥

అ. ఆగమాది సన్నుతేన అఖిలవిశ్వ వందితేన
త్యాగరాజ విభాతేన తాపత్రయసమేతేన ॥

చ. వేదాంతార్థవేద్యేన వికల్పరోగవైద్యేన
నాదామృత సుపాద్యేన నవనాథేనాద్యేన
సాదాఖ్యకళాకరేణ సదాశివావతారేణ
నాదాంతవిహారేణ నవచక్రాధారేణ
పాదాంబుజేన పరేణ ఖేదాదివిదారేణ
ఆదిగురుగుహావరేణ కాదిమతానుసారేణ ॥

## 4

సామ రాగము - ఆది తాళము

ప. గురుగుహాయ భక్తానుగ్రహాయ
కుమారాయ నమో నమస్తే ॥గురు

అ. గురుగుహాయ భక్తానుగ్రహాయ
గుణాతీతాయ రూపరహితాయ

హరిహర విరించిరూపాయ
సచ్చిదానంద స్వరూపాయ శివాయ ॥గురు

చ. సకలాగమ మంత్రసారజ్ఞాయ
సత్సంప్రదాయ సర్వజ్ఞాయ
సకల నిష్కల ప్రకాశకాయ
సామరస్య సంప్రదాయకాయ
వికళేబర కైవల్యదానాయ
వికల్పహీనాయ విజ్ఞానాయ
శుకవామదేవ వందిత పదాయ
శుకవామదేవ ముక్తిభేదాయ ॥గురు

## 5

బలహంస రాగము - ఝంప తాళము

ప. గురుగుహాదన్యం నజానేఽహం
గుప్తాగమార్థ తత్వప్రబోధినో ॥గురు

అ. అరుణోదయానంతకోటి బ్రహ్మాండాకర
శివాది ధరాంత తత్వస్వరూపిణో ॥గురు

చ సహస్రదళ సరసిజమధ్య నివాసినో
సకలచంద్ర భాస్కర తేజః ప్రకాశినో
సహజానందస్థితదాస విశ్వాసినో
సచ్చిత్సుఖాత్మక స్వవిలాసినో

అహారహః ప్రబలహంస ప్రకాశాత్మనో
దహరవిద్యాప్రదాయక పరమాత్మనో
జహదజహల్లక్షణయా జీవైక్యాత్మనో
రహః పూజిత చిదానందనాథాత్మనో ॥గురు

## 6

పూర్వీరాగము – మిశ్రఏకతాళము

ప శ్రీ గురుగుహస్య దాసోఽహం
నోచేత్ చిద్గురు గుహావహాహం ॥
అ. భోగమోక్షాత్మకచరణస్య
భూపురాది నవావరణస్య
యోగి బృందాంతఃకరణస్య
యోగపీఠాధికరణస్య ॥
చ. సనకాది పూర్వీకమునిగణ సన్నుతానంద విగ్రహస్య
వనజ భవాది సకల సుమనో వాంఛితార్థానుగ్రహస్య
జననలయాది రూపప్రపంచాజ్ఞాన కార్యనిగ్రహస్య
మననధ్యానసమాధినిష్ఠ మహానుభావ హృద్గ్రహస్య
దినకరకోటి విభాస్వరస్య
తేజోమయ జగదీశ్వరస్య
జనరంజనకరస్య వరస్య
సర్వస్మాత్పరస్య హరస్య ॥

## 7

భానుమతి రాగము — ఖండజాతి త్రిపుట తాళము

ప. గురుగుహస్వామిని భక్తిం కరోమి
నిరుపమ స్వే మహిమ్ని కరంధామ్ని ॥

అ. కరుణాకర చిదానంద నాథాత్మని
కరచరణాద్యవయవ పరిణామాత్మని
తరుణోల్లాసాది పూజిత స్వాత్మని
ధరణ్యాద్యఖిల తత్త్వాతీతాత్మని ॥

చ. నిజరూపజిత పావకేందు భానుమతి
నిరతిశయానందే హంసోవిరమతి
అజశిక్షణ రక్షణ విచక్షణ సుమతి
హరిహయాది దేవతాగణ ప్రణమతి
యజనాది కర్మనిరత భూసురహితే
యమనియమాద్యష్టాంగ యోగవిహితే
విజయవల్లీ దేవసేనా సహితే
వీరాదినన్నుతే వికల్పరహితే ॥

## 8

ఉదయరవిచంద్రిక రాగము — రూపక తాళము

ప. శ్రీ గురు గుహమూర్తే చిచ్ఛక్తిస్ఫూర్తే
శిష్యజనావనకీర్తే సముదయార్తే ॥

అ. యోగినీ హృదయప్రకాశ చిత్తవృత్తే
యుగపద్భోగ యోగప్రదాన నిపుణశక్తే
ఆగమరహస్య తత్వానుసంధానయుక్తే
ఆనందానురక్తే అతివిరక్తే జయజయ ॥

చ ఆత్మేశ్వర జీవభేదావరణ నివృత్తే
ఆశ్రితశిష్యానుగ్రహ కారణప్రవృత్తే
ఆత్మతత్వాది శోధన సాధన సంపత్తే
ఆరక్తశ్వేతమిశ్ర చరణప్రవృత్తే
ఆత్మకోటి భక్తే అనాదిమాయోత్పత్తే
ఆత్మానుభవసార సంతృప్తే నిర్ముక్తే
ఆత్మోదయ రవిచంద్రికా సందీప్తే
పరమాత్మ శ్రీ చిదానందనాథ నమస్తే జయజయ ॥

## II. పంచలింగస్థల కీర్తనలు

### 1

హుసేని రాగము – ఝంప తాళము

ప. శ్రీ కాళహస్తీశ శ్రితజనావన
సమీరాకార మాంపాహి రాజమౌళే ఏహి ॥శ్రీ

అ. పాకారి విధి హరి ప్రాణమయకోశా-
-నిలాకాశ భూమి సలిలాగ్నిప్రకాశ శివ ॥శ్రీ

చ. జ్ఞానప్రసూనాంబికాపతే
భక్తాభిమానదక్షిణకైలాసవాసా౨
భీష్టదాన చతురకరాబ్జ
దీనకరుణానిధే సూనశరసూదనే
జ్ఞానభవ పశుపతే జ్ఞానగురుగుహా
సచ్చిదానందమయమూర్తే
హీనజాతికిరాతకేన పూజితకీర్తే ॥శ్రీ॥

## 2

భైరవి — రూపకము

ప. చింతయ మాకందమూలకందం
చేతః శ్రీ సోమాస్కందం ॥
అ. సంతతం అఖండసచ్చిదానందం
సామ్రాజ్యప్రదచరణారవిందం ॥
చ. మంగళకర మందహాసవదనం
మాణిక్యమయ కాంచీసదనం
అంగసౌందర్య విజిత మదనం
అంతకసూదనం కుందరదనం
ఉత్తుంగ కమనీయ వృషతురంగం
భైరవీ ప్రసంగం
గురుగుహాంతరంగం పృథివీలింగం ॥ చింతయ

## 3

సారంగ రాగము — రూపక తాళము

ప. అరుణాచలనాథం స్మరామ్యనిశ
మపీతకుచాంబాసమేతం || అరుణా

అ. స్మరణాత్కైవల్యప్రద చరణారవిందం
తరుణాదిత్యకోటిసంకాశచిదానందం
కరుణారసాదికందం
శరణాగత సురబృందం ||అరుణా

చ. అప్రాకృత తేజోమయలింగం
అత్యద్భుతకరధృతసారంగం
అప్రమేయ మపర్ణాబ్జభృంగం
ఆరూఢోత్తుంగ వృషతురంగం
విప్రోత్తమ విశేషాంతరంగం
వీరగురుగుహతార ప్రసంగం
స్వప్రదీపమాళి విధృతగంగం
స్వప్రకాశజిత సోమాగ్నిపతంగం || అరుణా

## 4

యమునాకళ్యాణి రాగము - త్రిపుటక తాళము

ప. జంబూపతే మాంపాహి
నిజానందామృతబోధం దేహి ॥

అ. అంబుజాసనాది సకలదేవనమన తుంబురునుతహృదయ
తాపోపశమన అంబుధి గంగా కావేరీ యమున
కంబుకంఠ్యఖిలాండేశ్వరీ రమణ ॥జంబూ

చ. పర్వతజాప్రార్థితాప్పులింగవిభో
పంచభూతమయ ప్రపంచప్రభో
సర్వజీవదయాకర శంభో
సామజాటవీనిలయ స్వయంభో
శర్వ కరుణాసుధాసింధో
శరణాగతవత్సలార్తబంధో
నిర్వచనీయనాదబిందో
నిత్యమౌళి విధృతగంగేందో
నిర్వికల్పక సమాధినిష్ఠ శివకల్పకతరో
నిర్విశేషచైతన్య నిరంజన గురుగుహగురో ॥

## 5

కేదార రాగము - మిశ్రఏక తాళము

ప. ఆనందనటనప్రకాశం చిత్సభేశం
ఆశ్రయామి శివకామవల్లీశం ॥

అ. భానుకోటికోటిసంకాశం
భుక్తిముక్తిప్రద దహరాకాశం
దీనజనసంరక్షణచణం దివ్యపతంజలి-
-వ్యాఘ్రపాదదర్శిత కుంచితాబ్జచరణం ॥ఆనంద

చ. శీతాంశు గంగాధరం నీలకంధరం
శ్రీకేదారాదిక్షేత్రాధారం
భూతేశం శార్దూలచర్మాంబరం చిదంబరం
భూసురత్రివాసి మునీశ్వరం విశ్వేశ్వరం
నవనీతహృదయం సదయగురుగుహతాతమాద్యం
వేదవేద్యం
వీతరాగిణమప్రమేయాద్వైతప్రతిపాద్యం
సంగీతవాద్య వినోదతాండవజాతబహుతరభేదచోద్యం
॥ఆనంద

# III అభయాంబా కీర్తనలు

## 1

కల్యాణి రాగము - ఆది తాళము

ప అభయాంబా జగదంబా రక్షతు
ఆత్మరూపప్రతిబింబా మదంబా ॥అభ

అ. ఇభవదన శ్రీ గురుగుహజననీ
ఈశమాయూరనాథరంజనీ
అభయవరదపాణీ అలివేణీ
ఆశ్రితమావాణీ కల్యాణీ ॥అభ

చ. భక్తనాగలింగ పరిపాలినీ
భాసమాన నవరత్నమాలినీ
వ్యస్తసమస్త జగద్విశాలినీ
వ్యధికరణహరణ నిపుణశూలినీ

రక్తశుక్ల మిశ్రప్రకాశినీ
రవికోటికోటి సంకాశినీ
భక్తియుక్త మానసనివాసినీ
భావరాగతాళ విశ్వాసినీ
భుక్తిఫలప్రద దక్షమృడానీ
భక్తిప్రద నిపుణతర భవానీ
శక్తిసంప్రదాయక శర్వాణీ
భుక్తిముక్తి వితరణ రుద్రాణీ ॥అభ

## 2

భైరవి రాగము - అట తాళము

ప. ఆర్యాం అభయాంబాం భజరే రేచిత్త సంతతం అవిద్యా
కార్య
కలనాం త్యజరే ఆదిమధ్యాంతరహితాం శివసహితాం॥

అ. సూర్యాగ్నిచంద్రమండలమధ్యవాసినీం
సుఖతరప్రవర్తనీం
స్వేతరనివాసినీం ఆచార్యశిష్యానుగ్రహాకరణశక్తిప్రదా
పారకరుణాం చర్యాదిచతుష్టయ వితరణ
సమర్థతరచరణాం అరుణాం ॥ఆర్యాం

చ. నందనవనోత్పాదనపుష్పమాలికాం వందనాలయాది
ప్రస్థాపనదివ్యచందన కర్షణస్థలశుద్ధికరణవందనస్తోత్రాది

పతనభక్తసేవనాం మందధీహరణ చర్యాయుత
మానవానాం
ధర్మమయ స్వచ్ఛందశివసాలోకదాయక చతురతర
హరనటభైరవీం మందస్మితవిలసితముఖారవిందాం
గురుగుహాంబికాం ముకుందసోదరీం మహాత్రిపుర
సుందరీం
ఆనందలహరీం ॥ఆర్యాం

## 3

శంకరాభరణ రాగము - ఆది తాళము

ప. గిరిజయా అజయా అభయాంబికయా
గిరీశజాయయా రక్షితోహం ॥గి

అ. హరిహరాయాది దేవతారాధితయా
ఆత్మస్వరూప ప్రబోధితయా
హరిహరగురుగుహ సమ్మోదితయా
ఆదిక్షాంత వర్ణవేదితయా ॥గి

చ. సమయవిశేష నిర్వాణముఖబీజ
నిర్బీజదీక్షా విషయకరణ
సమయాచరణోపయోగ ప్రజ్ఞాసామగ్రి
సంగ్రహాంతఃకరణ
సమయమతప్రతిపాద్యానుసరణ
సామాన్యవిశేషప్రజాచరణ

మమత్వనిరాకరణ ప్రియాయుత సద్భక్తానాం
ధర్మార్థరూపసమత్వవృత్తివితరణ
నిపుణతర సామ్రాజ్యప్రదారుణశరణయా ॥గి

## IV. తిరువారూరు త్యాగరాజ కీర్తనలు

### 1

అఠాణ రాగము - తిస్రఏక తాళము

ప. త్యాగరాజో విరాజతే మహారాజరాజశ్రీ
॥త్యాగరాజో

అ. వాగర్థమయభువనరాజో హరివాంఛితార్థప్రదరాజో
హరశ్రీగురుగుహ గణేశరాజో సంసేవిత రాజాధిరాజో
అజో

నాగరఖండాఖ్యపురాణప్రతిపాదితరాజో
యోగినీగణరాజో యోగిరాజరాజశ్రీ ॥త్యాగరాజో

చ. కలిరాహిత్యనగరవాసో
నీలోత్పలనాయికా సహవాసో
అతిలలితహంసలాస్యోల్లాసో
నిఖిలాగమ శిరోనుతవిలాసో
అతివిలసితహాటకావభాసో
అనేకలీలావిచిత్రవికాసో

రక్తోత్పలకుసుమాదివిశ్వాసో
పరిపాలితహరిహరాదిదాసో
నిర్మలహృదయ రాజహంసో
మహాపరమహంసో
నిశ్చలతత్వప్రశంసశశికలావతంసః ॥శ్రీత్యాగరాజో

## 2

యదుకులకాంభోజి రాగము - మిశ్రఏక తాళము

ప. త్యాగరాజం భజరే రేచిత్త
తాపత్రయం త్యజరే రేచిత్త ॥త్యాగ

అ. యోగిరాజహృదయాబ్జనిలయం
భోగిరాజనుతచరణకిసలయం
నాగరాజమణివలయం
రజతాగరాజం ముఖకువలయం ॥త్యాగ

చ పౌలోమీశాది దిక్పాలపూజితగాత్రం
నీలోత్పలాంబానుకూలతరకళత్రం
త్రైలోక్యగురుగుహతాతం త్రిణేత్రం
సాలోకాదికైవల్యప్రదచరిత్రం
నీలకంఠమనేకఫలదం
శూలపాణిమశోకశుభదం
మూలభూతమమూల్యవరదం
కాలకాలమఖండసుఖదం ॥త్యాగ

## 3

సాళగభైరవి రాగము - ఆది తాళము

ప. త్యాగరాజేన సంరక్షితోఽహం
దయాసుధాసాగరేణ ॥శ్రీ

అ యాగశాలాదిమహోత్సవేన
యతివరాద్యుపాసితేన భవేన
భోగభోగ్య ప్రపంచోద్భవేన
భుక్తిముక్తిప్రద పరమశివేన ॥

చ. శ్రీరమణాదిపూజితచరణేన
సృష్ట్యాదిపంచకృత్యకరణేన
హారకటకమకుటాదిభరణేన
హాటకక్షేత్రాధికరణేన
వీరఖడ్గఖేటాదిధరణేన
వికల్పవిరహితాంతఃకరణేన
మారకాలత్రిపురాదిహరణేన
మహాదేవగురుగుహస్మరణేన ॥

## 4

బేగడ రాగము - రూపక తాళము

ప త్యాగరాజాయ నమస్తే నమస్తే
కాత్యాయనీపతే పశుపతే సింహాసనపతే ॥త్యాగ

అ. వాగీశాద్యఖిలదేవవందితపదపంకజాయ
యోగీశ్వరమానససంయుక్తవదనవారిజాయ
భోగమోక్షదానవామభాగస్థితశైలజాయ
యోగగురుగుహాత్మజాయ
త్యాగధ్వజాయ అజాయ ॥ త్యాగ

చ ముకుందాదిపూజిత సోమాస్కందమూర్తయే
ముచుకుందాది భక్తజన మనోరథపూర్తయే
ముకురబింబ ప్రతిబింబిత ముఖస్ఫూర్తయే
మునిపక్షిమృగకీటాది ముక్తిప్రదకీర్తయే
సకలాగమ మంత్రతంత్రసారజ్ఞానురక్తయే
అకతాది త్రిరేఖాత్మకాధారప్రవృత్తయే
సకలనిష్కళస్వరూపసచ్చిత్సుఖవ్యాప్తయే
వికల్పభేదయుక్తయే
విటంకరూపశక్తయే ॥ త్యాగరాజాయ

## 5

దర్బారు రాగము - ఆది తాళము

ప. త్యాగరాజాదన్యం నజానే గురుగుహాది
సమస్తదేవతాస్వరూపిణః ॥ శ్రీ

అ. రాగాదివృత్తిరహితస్వానుభోగానందస్ఫూర్తివిశేషాష్ట
భూగంధవాహ వహ్నిజల గగనపుష్పవదర్క్యజ్వమయ
మూర్తేః ॥ శ్రీ

చ. సత్త్వరజస్తమోగుణాతీత సత్యజ్ఞానానందరూపిణో
ద్విత్వాదిభేదవర్జన పరమాద్వైతస్వాత్మానందరూపిణో
త్రిత్వపరిచ్ఛేదరాహిత్య త్రైవిధపరమాద్వైత
రూపిణో
తత్త్వంపదార్థశోధన శేషిత తత్పదలక్ష్యార్థ
స్వరూపిణో
తత్త్వసమష్టివ్యష్టిరూపలయ తారకబ్రహ్మరూపాత్మనో
తత్త్వం స్వాతిరిక్తప్రపాన తత్సక్తమాన
రూపాత్మనః ॥శ్రీ

## 6

రుద్రప్రియ రాగము - త్రిపుట తాళము

ప. శ్రీ త్యాగరాజస్య భక్తో భవామి
చింఛిత్ జోప్యతోహం సర్వ జీవాస్మి ॥

అ. కాత్యాయనీమోహిత స్వరూపస్య
కామాది వృత్తిహరణ ప్రతాపస్య ।
భూత్యాభరణాలంకృతగాత్రస్య
బుద్ధశుద్ధ నిత్యానందమాత్రస్య ॥

చ. అమరేశాదిపూజిత సాయంకాలస్య
అతిశుద్ధమద్దళాదివాద్యలీలస్య
నవనన్ద్యాది భక్తజనపాలస్య
నతసురాసుర సంయతిజాలస్య

కమలకల్హారమాలస్య కాంచనమణిమయచేలస్య
కమనీయగురుగుహమూలస్య కమలాపురకృతలీలస్య
విమలరుద్రగణికా నర్తనవినోదభేదమోదకస్య
కమలవిడంబనకరస్య శంకరస్య పురహరస్య హరస్య॥

## 7

సారంగ రాగము - ఝంప తాళము

ప. త్యాగరాజే కృత్యాకృత్యమర్పయామి
విదేహకైవల్యం యామి ॥త్యాగరాజే

అ. భోగయోగాత్మకే భుక్తిముక్త్యాత్మకే
త్యాగరాగాత్మకే తత్త్వం పరాత్మకే ॥త్యాగరాజే

చ. ప్రకృతిపురుషాత్మకే పంచభూతాత్మకే
ప్రకృతివికృతాత్మకే పంచీకృతాత్మకే
సుకృతిహృదయాత్మకే సూర్యచంద్రాత్మకే
వికృతిభేదాత్మకే విశ్వేశ్వరాత్మకే
సుకృతిపూర్ణాత్మకే
సురగురుగుహాత్మకే సకృదసకృదాత్మకే
సచ్చిత్సుఖాత్మకే ॥శ్రీత్యాగరాజే

## 8

వీరవసంత రాగము - ఆది తాళము

ప. వీరవసంత త్యాగరాజ మాం
తారయాశు కరుణానిధే ॥జయ

అ. మారజనకపూజిత మహాదేవ
మానితాజపానటనప్రభావ ॥

చ. దినకరశశితేజోమయలోచన
దేవరాజముని శాప విమోచన
వనజవదన కమలానగరసదన
వల్మీకేశ్వర భక్తజనావన
కనకరత్నసింహాసనాభరణ
గణపతిజనక భవతరణ
జననాత్రైరూవల్యదాయకచరణ
జననీ శ్రీ కమలాంబికాస్మరణ ॥

## ౯

### శ్రీ రాగము - ఆది తాళము

ప. త్యాగరాజ మహాధ్వజారోహ
తారకబ్రహ్మరూపమాశ్రయే
గణేశగురుగుహ భక్తభైరవ సోమమయం ॥శ్రీ

అ. ఆగమసిద్ధాంతప్రతిపాద్యం
ఆనందచంద్రశేఖరవేద్యం
నాగస్వరమర్దళాదివాద్యం
నామరూపాతీతమనాద్యం
యాగశాలాద్యుత్సవచోద్యం

యమాద్యష్టాంగయోగమాద్యం
భోగరాగభేదరోగవైద్యం
బోధామృత మహానైవేద్యం ॥త్యాగ

చ. సృష్టిస్వరూప వసంతవైభవమష్టధ్వజేంద్రవిమానభూత
సమష్టిగజవృషభకైలాసవాహ
మాశ్లేషమహారథస్థితం
విశిష్టహారం కృష్ణగంధధరణం శిష్టసేవితాజపాన ర్తనం
అష్టపాశహర తీర్థప్రభావ అనుగ్రహాత్మక పాదదర్శనం
ఇష్టఫలప్రద కల్యాణసుందరేశ నావమాచార్యప్రాభవ
మష్టసిద్ధిదాయకాంబికోత్సవ
మారూఢచండేశ్వరం ॥త్యాగ

## 10

గౌళ రాగము - ఆది తాళము

ప. త్యాగరాజ పాలయాశు మాం శ్రీ
నిత్యానందకంద సోమాసకంద వీథీవిటంక ॥

అ నాగరాజ మణిభూషాలంకృత
నగరాజసుతార్ధాంగ
గాళాంగభోగాదిప్రద శ్రీనగరస్థిత
భూసురాదినుత
వల్మీకలింగ శ్రీ గురుగుహపూజిత

వృషతురంగ
శ్రితజనరక్షణ నిపుణాంతరంగ
భోగియుతచరణ కరధృతకురంగ
యోగివిదితా జపానటనరంగ ॥త్యాగరాజ

## 11

నీలాంబరి రాగము - రూపక తాళము

ప త్యాగరాజం భజేఽహం సతతం ॥త్యాగరాజం

అ. యోగినారాయణాద్యుపాసితం ప్రభాసితం
యోగభోగవితరణ నిపుణతరకరం దయాకరం
నాగరఖండాఖ్యపురాణ ప్రతిపాద్యమనాద్యం
నామరూపమయచోద్యం
నారదగురుగుహవేద్యం ॥త్యాగరాజం

## 12

ఆనందభైరవి రాగము - రూపక తాళము

ప. త్యాగరాజయోగవైభవం
సదాశివం సదాశ్రియామి ॥

అ. త్యాగరాజయోగవైభవం
అగరాజయోగవైభవం రాజ
యోగవైభవం యోగవైభవం వైభవం
భవం వం ॥

చ. నాగరాజవినుతపదం
నాదబిందుకళాస్పదం
యోగిరాజవిదితపదం
యుగపద్భోగమోక్షప్రదం
యోగరూఢనామరూప విశ్వసృష్ట్యాదికరణం
యుగపరివృత్త్యబ్దమాస దినఘటికాద్యావరణం
శ్రీ గురుగుహగురుం సచ్చిదానందభైరవీశం శివశక్త్యాది
సకలతత్వస్వరూప ప్రకాశం
శం ప్రకాశం స్వరూప ప్రకాశం
తత్వస్వరూప ప్రకాశం
సకలతత్వస్వరూప ప్రకాశం
శివశక్త్యాది సకలతత్వస్వరూప ప్రకాశం ॥ త్యాగరాజ

## 13

రుద్రప్రియ రాగము - ఆదితాళము

ప. త్యాగేశం భజరే రేమానస
తాపాదిం త్యజరే రేమానస ॥ త్యాగేశం

అ. యోగీశవిహితం భోగీశమహితం
శ్రీగురుగుహవిదితం సురముదితం
సింహాసనపతిం పశుపతిం ॥ త్యాగేశం

# V. తిరువారూరు శివలింగ కీర్తనలు

## 1

భూపాళ రాగము - తిస్రఏక తాళము

ప. సదాచలేశ్వరం భావయే
చమత్కారపురగేహం గిరిజా మోహం ॥

అ. సదాశ్రితకల్పవృక్ష సమూహం
శరణాగతదేవతాసమూహం
ఉదాజ్యకృతనామధేయవాహం
చిదానందామృతప్రవాహం ॥

చ. చమత్కారభూపాళాదిప్రసాదకరణ నిపుణమహాలింగం
ఛాయారహితదీపప్రకాశగర్భగృహామధ్యరంగం
సమస్తదుఃఖాదిహేతుభూత సంసారసాగర భయభంగం
శమదమాదివృత్త్యాది సంయుక్తసాధుజనహృదయ
సరసిజభృంగం

కమలవిజయ కరవిధృతకురంగం
కరుణారససుధార్ణవతరంగం
కమలేశవినుత వృషభతురంగం
కమలవదన గురుగుహాంతరంగం ॥

## 2

బిలహరి రాగము - మిశ్రఏక తాళము

ప. హాటకేశ్వర సంరక్ష మాం
తప్తహాటకమయలింగమూర్తే త్రియాత్మక ॥

అ. పాటలీపాదపమూలప్రకాశ
పాతాళబిల హరిహయాద్యమరనుత
హాటకక్షేత్రనివాస హంసరూప చిద్విలాస
కోటికోటిచిదాభాస గురుగుహమానసోల్లాస
॥హాటకేశ్వర

చ. దారుకావనస్థ తపోధనాద్యుగ్రతపఃప్రభావ
సంభవమూర్తే
మేరుశృంగమధ్యస్థిత శ్రీనగరవిహార పరాశక్తి
సహితకీర్తే
మారుతినంద్యర్జునాది భరతాచార్యైరవేదిత నర్తన
స్ఫూర్తే
చారుస్మితముఖాంభోజ శశిధర సరసీరుహపద విదళిత
భక్తార్తే
గౌరీపతే పశుపతే గంగాధర జగత్పతే
శౌరివినుత భూతపతే శంకర కైలాసపతే ॥హాట

# 3

కాంభోజి రాగము - ఆట తాళము

ప. శ్రీ వల్మీకలింగం చింతయే శివార్ధాంగం ॥శ్రీ

అ. శ్రీ వరదాయకం శ్రీ పురనాయకం
దేవతాదివినుతదివ్యవీథివిటంకం ॥శ్రీ

చ. కురుక్షేత్ర విరించియజ్ఞోద్భవ కార్ముకధర మురరిపుహర
హరిహయాద్యఖిల సురభయాపదపహరణచణతరం
శంకరం సోమకులాంబికాంభోజమధుకరం
గురుగుహజనకం నతజనకం కుబేరసఖం చర్మాంశుకం
సురుచిర శిరోధృతశశాంకం స్వయంప్రకాశకం
తారకం ॥

# 4

ఆనందభైరవి రాగము - మిశ్రఏక తాళము

ప ఆనందేశ్వరేణ సంరక్షితోఽహం
నిత్యానందరూపోఽస్మి
బ్రహ్మానందరూపోఽస్మి ॥

అ. జ్ఞానప్రదాన గురుగుహరూప చిదానందనాథ స్వరూప
ప్రకాశేన ॥

చ. అనయావత్రయాతీతేన నిత్యేన
అవస్థాత్రయసాక్షిణాతిశుద్ధేన

భవపంచకోశవ్యతిరిక్తేన బుద్ధేన
శివసచ్చిదానందరూపేణ
ముక్తేన శ్రవణమనననిధిధ్యాసనసమాధినిష్ఠా
పరోక్షాను
భవస్వమాత్రావశేషిత ప్రకాశమాన మహేశ్వరేణ

## 5

నీలాంబరి రాగము - మిశ్రఏక తాళము

ప. సిద్ధీశ్వరాయ నమస్తే
జగత్ప్రసిద్ధేశ్వరాయ నమస్తే ॥సిద్ధీ

అ. బుద్ధీశ్వరాయ వరాయ వరాయ
భుక్తిముక్తిప్రదచతురతరకరాయ
శుద్ధసత్వగుణాకరాయ విశుద్ధిచక్రనిలయాయ
నిత్యసుఖతరకరాయ శంకరాయ ॥సిద్ధీశ్వరాయ

చ. నిర్మలహృదయవిహారాయ హారాయ
నీలాంబరాకారాయ శ్రీకరాయ
చర్మాంబరధరాయ చంద్రశేఖరాయ
శబ్దాదిపంచతన్మాత్రాధారాయ
ధర్మాద్యఖిలపురుషార్థప్రదాయక
గురుగుహకుమారాయ
కర్మజ్ఞానయోగసాక్షాత్కారాయ
విదళితమారాయ ॥సిద్ధీ

# VI. నవావరణ కీర్తనలు

## 1

తోడి రాగము . రూపక తాళము

ప. కమలాంబికే ఆశ్రితకల్పలతికే చండికే
కమనీయారుణాంశుకే కరవిధృతశుకే
మామవ కమలాంబికే జగదంబికే

అ. కమలాసనాదిపూజితకమలపదే బహువరదే
కమలాలయ తీర్థవైభవే శివే కరుణార్ణవే ॥

చ. సకలలోకనాయికే సంగీతరసికే
సుకవిత్వప్రదాయికే సుందరి గతమాయికే
వికళేబరముక్తిదాననిపుణే అఘహరణే
వియదాదిభూతకిరణే వినోదచరణే
సకళే గురుగుహకరణే సదాశివాంతఃకరణే
అకచటతపాదివర్ణే అఖండైకరసపూర్ణే ॥

## 2

ఆనందభైరవి రాగము - మిశ్రఏక తాళము

ప. కమలాంబా సంరక్షతు మాం హృత్కమలనగర
నివాసినీ।

అ. సుమనసారాధితాబ్జముఖీ సుందరమనఃప్రియకరసఖీ
కమలజానందబోధసుఖీ కాంతాతారపంజరశుకీ ॥

చ. త్రిపురాది చక్రేశ్వరీ అణిమాదిసిద్ధేశ్వరీ
నిత్యాకామేశ్వరీ
క్షితిపుర త్రైలోక్యమోహనచక్రవర్తినీ ప్రకటయోగినీ
సురరిపుమహిషాసురాదిమర్దనీ నిగమపురాణాది
సంవేదినీ
త్రిపురేశీ గురుగుహజననీ త్రిపురభంజనరంజనీ మధురిపు
సహోదరీ తలోదరీ త్రిపురసుందరీ మహేశ్వరీ

# 3

కల్యాణి రాగము . ఆది తాళము

ప. కమలాంబాం భజరే రేమానస కల్పితమాయాకార్యం
త్యజరే ॥కమ

అ. కమలావాణీ సేవితపార్శ్వాం కంబుజయగ్రీవాం
నతదేవాం
కమలాపురసదనాం మృదుగదనాం కమనీయరదనాం
కమలవదనాం ॥కమ

చ. సర్వాశాపరిపూరకచక్రస్వామినీం పరమశివకామినీం
దుర్వాసార్చితగుప్తయోగినీం దుఃఖధ్వంసినీం హంసినీం
నిర్వాణనిజసుఖప్రదాయినీం నిత్యకల్యాణీం
కాత్యాయనీం

శర్వాణీం మధుపవిజయ వేణీం సద్గురుగుహజననీం
నిరంజనీం
గర్వితభండాసురభంజనీం కామాకర్షణ్యాదిరంజనీం
నిర్విశేషచైతన్యరూపిణీం ఉర్వీతత్త్వాదివిశ్వరూపిణీం
॥కమలాంబాం

# 4

శంకరాభరణ రాగము - రూపక తాళము

ప శ్రీ కమలాంబికయా కటాక్షితోఽహం
సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మాస్మి ॥శ్రీకమలాంబి

అ. పాకశాసనాది సకలదేవతా సేవితయా
పంకజాసనాది పంచకృత్య కృద్భావితయా
శోకహరచతురపదయా మూకముఖ్య వాక్ప్రదయా
కోకనదవిజయపదయా గురుగుహ తత్త్రైపదయా ॥శ్రీ

చ. అనంగకుసుమాద్యష్టశక్త్యాకారయా
అరుణవర్ణ సంక్షోభణచక్రాకారయా
అనంతకోట్యండనాయకశంకరనాయికయా
అష్టవర్గాత్మకగుప్తతరయా వరయా
అనంగాద్యుపాసితయా అష్టదళాబ్జస్థితయా
ధనుర్బాణధరకరయా దయాసుధాసాగరయా
॥శ్రీకమలాంబి

## 5

కాంభోజి రాగము - ఖ. అటతాళము

ప. కమలాంబికాయై కనకాంశుకాయై
కర్పూరవీటికాయై నమస్తే నమస్తే ॥కమలాంబి

అ. కమలాకాంతానుజాయై కామేశ్వర్యై అజాయై
హిమగిరి తనూజాయై హ్రీంకారపూజ్యాయై
కమలానగర విహారిణ్యై ఖలసమూహసంహారిణ్యై
కమనీయరత్నహారిణ్యై కలికల్మషపరిహారిణ్యై ॥కమ

చ. సకలసౌభాగ్యదాయకాంభోజచరణాయై
సంక్షోభిణ్యాదిశక్తియుతచతుర్థావరణాయై
ప్రకటచతుర్దశభువనభరణాయై
ప్రబలగురుగుహసంప్రదాయాంతఃకరణాయై
అకలంకరూపవర్ణాయై అపర్ణాయై సువర్ణాయై
సుకరధృతచాపబాణాయై శోభనకరమనుకోణాయై
సకుంకుమాది లేపనాయై చరాచరాదికల్పనాయై
చికురవిజితనీలఘనాయై చిదానందపూర్ణఘనాయై
॥కమలాంబి

## 6

భైరవి రాగము - ఝంప తాళము

ప. శ్రీ కమలాంబాయాః పరం నహిరే రేచిత్త క్షిత్యాది
శివాంతతత్వస్వరూపిణ్యాః ॥

అ. శ్రీకంఠవిష్ణువిరించ్యాదిజనయిత్ర్యాః శివాత్మక
విశ్వకర్త్ర్యాః
కారయిత్ర్యాః శ్రీకర బహిర్దశారచక్రస్థిత్యా
స్సేవితభైరవీ భార్గవీ భారత్యాః ॥శ్రీ

చ నాదమయ సూక్ష్మరూప సర్వసిద్ధిప్రదాదిదశశక్త్యా
రాధితమూర్తేః
శ్రోత్రాది దశకరణాత్మకకుళకౌళికాది బహువిధో
పాసితకీర్తేః
అభేదనిత్యశుద్ధబుద్ధముక్త సచ్చిదానందమయ
పరమాద్వైత
స్ఫూర్తేః ఆదిమధ్యాంతరహితా ప్రమేయ గురుగుహ
మోదిత
సర్వార్థసాధకమూర్తేః మూలాదినవాధార వ్యావృత్త
దశధ్వనిభేదజ్ఞ యోగిబృందసంరక్షణ్యాః అనాది
మాయా
విద్యాకార్యకారణవినోదకరణ పటుతరకటాక్ష
వీక్షణ్యాః ॥శ్రీ

## 7

పున్నాగవరాళి రాగము - రూపక తాళము

ప. కమలాంబికాయా స్తవ భక్తోఽహం ॥శ్రీ
శంకర్యా శ్రీకర్యా స్సంగీతరసికాయా ॥శ్రీ

అ. సుమశరేక్షు కోదండపాశాంకుశపాణ్యా
అతిమధురతరవాణ్యాశ్శర్వాణ్యాః
కల్యాణ్యా రమణీయ పున్నాగవరాళివిజితవేణ్యాః ॥

చ. దశకలాత్మకవహ్నిస్వరూపప్రకాశాంతర్దశార
సర్వరక్షాకర చక్రేశ్వర్యాః త్రిదశాదినుత
కచవర్గద్వయ మయ సర్వజ్ఞాది దశశక్తిసమేత
మాలినీచక్రేశ్వర్యా త్రిదశవింశద్వర్ణగర్భిణీ
కుండలిన్యాః
దశముద్రాసమారాధిత కౌళిన్యాః
దశరథాదినుత గురుగుహజనక శివబోధిన్యాః
దశకరణవృత్తిమరీచినిగర్భయోగిన్యాః ॥కమలాం

## 8

సహనా రాగము - త్రిపుట తాళము

ప. శ్రీ కమలాంబికాయాం భక్తిం కరోమి
శ్రితకల్పవాటికాయాం చండికాయాం
జగదంబికాయాం ॥

అ. రాకాచంద్రవదనాయాం రాజీవనయనాయాం పాకారి
నుతచరణాయా మాకాశాది కిరణాయాం
హ్రీంకారవిపినహరిణ్యాం హ్రీంకారసుశరీరిణ్యాం
హ్రీంకారతరుమంజర్యాం హ్రీంకారేశ్వర్యాం గౌర్యాం॥

చ. శరీరత్రయవిలక్షణసుఖతరస్వాత్మానుభోగిన్యాం
విరించి
హరీశానహరిహయ వేదితరహస్యయోగిన్యాం
పరాదివాగ్దే
వతారూపవశిన్యాదివిభాగిన్యాం చరాత్మకసర్వ
రోగహర
నిరామయరాజయోగిన్యాం కరధృతవీణావాదిన్యాం
కమలానగరవినోదిన్యాం సురనరమునిజనమోదిన్యాం
గురుగుహావరప్రసాదిన్యాం ॥శ్రీకమలాంబి

## ౯

ఘంటా రాగము - ఆది తాళము

ప. శ్రీకమలాంబికే౽వావ శివే కరధృతశుకశారికే ॥

అ. లోకపాలిని శూలిని లోకజనని భగమాలిని
సకృదాలోకయ మాం సర్వసిద్ధిప్రదాయికే
త్రిపురాంబికే బాలాంబికే ॥శ్రీ

చ. సంతప్తహేమసన్నిభదేహే సదాఖండైకరసప్రవాహే
సంతాపహరత్రికోణగేహే సకామేశ్వరీ శక్తిసమూహే
సంతతం ముక్తిఘంటామణి ఘోషాయమాన
కవాటద్వారే
అనంతగురుగుహావిదితే కరాంగుళినఖోదయ
విష్ణుదశావతారే

అంతఃకరణేక్షుకార్ముకశబ్దాదిపంచతన్మాత్రవిశిఖాత్యంత
రాగపాశద్వేషాంకుశధరకరేఽతి రహస్యయోగినీపరే
।శ్రీ

## 10

ఆహిరి రాగము - తిశ్రఏక తాళము

ప. శ్రీ కమలాంబా జయతి అంబ జగదంబా
శృంగారరసకదంబా మదంబా చిద్బింబప్రతిబింబేందు
బింబా
శ్రీపురబిందుమధ్యస్థ చింతామణిమందిరస్థ శివాకార
మంచస్థిత
శివకామేశాంకస్థా ॥

అ. సూకరాననాద్యర్చితమహాత్రిపురసుందరీం
రాజరాజేశ్వరీం
శ్రీకరసర్వానందమయచక్రవాసినీంసువాసినీం
చింతయేఽహం
దివాకరశీతకిరణపావకాదివికాసకరయా
భీకరతాపత్రయాది
భేదనధురీణతరయా పాకరిపుప్రముఖాది ప్రార్థిత
సుకళేబరయా
ప్రాకట్యపరాపరయా పాలితోదయాకరయా ॥

చ. శ్రీమాత్రే నమస్తే చిన్మాత్రే సేవితరమాహరీశా
విధాత్రే వా

మాదిశక్తిపూజిత పరదేవతాయాఃసకలంజాతంకామాది
ద్వాదశభిరుపాసితకాదిహాదిసాది మంత్రరూపిణ్యాః
ప్రేమాస్పద శివగురుగుహజనన్యాం ప్రీతియుక్త
మచ్చిత్తం
విలయతు బ్రహ్మమయప్రకాశిసీ నామరూప విమర్శినీ
కామకళాప్రదర్శినీ సామరస్యనిదర్శినీ ॥

## 11

శ్రీ రాగము - ఖండఏక తాళము

ప. శ్రీ కమలాంబికే శివే పాహిమాం లలితే
శ్రీపతివినుతే సితాసితే శివసహితే ॥శ్రీ

అ. రాకాచంద్రముఖీ రక్షితకోలముఖీ రమావాణీసఖీ
రాజయోగసుఖీ శాకంబరి శాతోదరి చంద్రకళాధరి
శంకరి శంకరగురుగుహభక్తవశంకరి ఏకాక్షరి
భువనేశ్వరి
ఈశప్రియకరి శ్రీకరి శుభకరి శ్రీమహాత్రిపురసుందరి
॥శ్రీ

# VII. నవగ్రహ కీర్తనలు

## 1

సౌరాష్ట్ర రాగము - ధృవ తాళము

ప. సూర్యమూర్తే నమోఽస్తుతే సుందరచ్ఛాయాధిపతే

అ. కార్యకారణాత్మక జగత్ప్రకాశ సింహరాశ్యాధిప తే
ఆర్యవినుత తేజఃస్ఫూర్తే ఆరోగ్యాదిఫలదకీర్తే ॥

చ. సారసమిత్ర మిత్ర భానో సహస్రకిరణ కర్ణసూనో
క్రూరపాపహరకృశానో గురుగుహమోదితస్వభానో
సూరిజనేడిత సుదినమణే సోమాదిగ్రహశిఖామణే
ధీరార్చితకర్మసాక్షిణే దివ్యతరసప్తాశ్వరథినే
సౌరాష్టార్ణమంత్రాత్మనే సౌవర్ణస్వరూపాత్మనే
భారతీశహరిహరాత్మనే భక్తిముక్తివితరణాత్మనే
॥సూర్య

## 2

అసావేరి రాగము - మత్య తాళము

ప. చంద్రం భజమానస సాధుహృదయసదృశం ॥

అ. ఇంద్రాదిలోకపాలేడిత తారేశం
ఇందుం షోడశకళాధరం నిశాకరం
ఇందిరాసహోదరం సుధాకరమనిశం ॥

చ. శంకరమౌళివిభూషణం శీతకిరణం
చతుర్భుజం మదనచ్ఛత్రం క్షపాకరం
వేంకటేశనయనం విరాణ్మనోజననం
విధుం కుముదమిత్రం విధిగురుగుహవక్త్రం
శశాంకం గీష్పతిశాపానుగ్రహపాత్రం
శరచ్చంద్రికాధవళప్రకాశగాత్రం

కంకణ కేయూరహారమకుటాదిధరం
పంకజరిపుం రోహిణీప్రియకరం చతురం ॥చంద్రం

## 3

సురటి రాగము - రూపక తాళము

ప. అంగారకమాశ్రయామ్యహం వినతాశ్రితజనమందారం
మంగళవారం భూమికుమారం వారం వారం ॥అంగారక

అ. శృంగారకమేషవృశ్చికరాశ్యాధిపతిం
రక్తాంగం రక్తాంబరాదిధరం శక్తిశూలధరం
మంగళం కంబుగళం మంజులతరపదయుగళం
మంగళదాయకమేషతురంగం మకరోత్తుంగం ॥అంగారక

చ. దానవసురసేవిత మందస్మిత విలసితవక్త్రం
ధరణీప్రదం భ్రాతృకారకం రక్తనేత్రం
దీనరక్షకం పూజితవైద్యనాథక్షేత్రం
దివ్యౌఘాది గురు కటాక్షానుగ్రహపాత్రం
భానుచంద్రగురుగుహమిత్రం భాసమానసుకళత్రం
జానుస్థహస్తచిత్రం చతుర్భుజమతివిచిత్రం ॥అంగారక

## 4

నాటకురంజి రాగము - ఝంప తాళము

ప బుధమాశ్రయామి సతతం సురవినుతం
చంద్రతారాసుతం ।బుధ

అ. బుధజనై ర్వేదితం భూసురై ర్మోదితం
మధురకవితాప్రదం మహనీయసంపదం ॥బుధ

చ. కుంకుమసమద్యుతిం గురుగుహముదాకృతిం
కుజవైరిణం
మణిమకుటహార కేయూరకంకణాదిధరణం
కమనీయతర
మిథునకన్యాధిపం పుస్తకకరం నపుంసకం
కింకరజనమహితం
కిల్బిషాదిరహితం శంకరభక్తహితం
సదానందసహితం ॥బుధ

# 5

అఠాణ రాగము - తిశ్రత్రిపుట తాళము

ప. బృహస్పతే తారాపతే
బ్రహ్మజాతే నమోస్తుతే ॥బృ

అ. మహాబలవిభో గీష్పతే
మంజుధనుర్ మీనాధిపతే
మహేంద్రాద్యుపాశ్రితాకృతే
మాధవాదివినుత ధీమతే

చ. సురాచార్యవర్య వజ్రధర
శుభలక్షణజగత్రయగురో
జరావివర్జితాఽక్రోధకచ

జనకాశ్రితజనకల్పతరో
పురారిగురుగుహసమ్మోదిత
పుత్రకారకదీనబన్ధో
పరాదిచత్వారివాక్స్వరూప
ప్రకాశకదయాసింధో
నిరామయాయ నీతికర్త్రే
నిరంకుశాయ విశ్వభర్త్రే
నిరంజనాయ భువనభోక్త్రే
నిరంశాయ మఖప్రదాత్రే ॥బృ

## 6

పరజు రాగము - అట తాళము

ప. శ్రీ శుక్రభగవంతం చింతయామిసతతం సకలతత్వజ్ఞం॥

అ. హే శుక్రభగవన్ మామాశుపాలయ వృషతులాధీశ
దైత్యహితోపదేశ కేశవకటాక్షైకనేత్రం
కిరీటధరం ధవళగాత్రం ॥శ్రీశుక

చ. వింశతివత్సరోడుదశావిభాగ మష్టవర్గం కవిం
కళత్రకారకం రవినిర్జరగురువైరిణం
నవాంశహోరాద్రేకాణాది వర్గోత్తమావసరసమయం
పక్షోచ్చనీచస్వక్షేత్రవరకేంద్రమూలత్రికోణం

త్రింశాంశషష్ట్యంశై రావతాంశ పారిజాతాంశ
గోపురాంశ
రాజయోగకారకం రాజ్యప్రదం గురుగుహాముదం
॥శ్రీశుక్ర

## 7

యదుకులకాంభోజి రాగము - ఏక తాళము

ప. దివాకరతనూజం శనైశ్చరం ధీరతరం సంతతం
చింతయేఽహం ॥దివాకర

అ. భవాంబునిధౌ నిమగ్నజనానాం భయంకరం
అతిక్రూరఫలదం
భవానీశకటాక్షపాత్రభూతభక్తిమతాం
అతిశయశుభఫలదం ॥దివాకర

చ. కాలాంజనకాంతియుక్తదేహం కాలసహోదరం
కాకవాహం
నీలాంశుకపుష్పమాలావృతం నీలరత్న
భూషణాలంకృతం
మాలినీవినుతగురుగుహముదితం మకరకుంభరాశినాథం
తిలతైలమిశ్రితాన్నదీపప్రియం దయాసుధాసాగరం
నిర్భయం
కాలదండపరిపీడితజానుం కామితార్థఫలదకామధేనుం
కాలచక్రభేదచిత్రభానుం కల్పితఛాయాదేవీసూతం
॥దివాకర

## 8

రమామనోహరి రాగము - రూపక తాళము

ప స్మరామ్యహం సదా రాహుం సూర్యచంద్రవిక్ష్యం
వికృతదేహం ||

అ. సురాసురం రోగహారం సర్వాపిభీతిహారం
శూర్పాసన సుఖకరం శూలాయుధధరకరం ||స్మరా

చ. కరాళవదనం కఠినం కయానార్ణకరుణార్ద్రాపాంగం
చతుర్భుజం ఖడ్గఖేటాదిధరం చర్మాదినీలవస్త్రం
గోమేదకాభరణం
శనిశుక్రమిత్ర గురుగుహసంతోషకరణం ||స్మరా

## 9

చామర రాగము - రూపక తాళము

ప మహాసురం కేతుమహం భజామి ఛాయాగ్రహవరమ్
||మహా

అ. మహావిచిత్రమకుటధరం మంగళవస్త్రాదిధరం
నరపీఠస్థితం సుఖం నవగ్రహాయుతసఖం ||మహాసురం

చ. కేతుం కృణ్వన్మంత్రిణం క్రోధనిధిజైమినం
కులుత్థాతి భక్షణం కోణధ్వజపతాకినం
గురుగుహచామరభరణం గుణదోషచిదాచరణం
గ్రహణాదికార్యకరణం గ్రహోపసవ్యసంచారిణం
||మహాసురం

# VIII. విడికీర్తనలు

## 1

ఈశమనోహరి రాగము - తిశ్రజాతి ఏకతాళము

ప. శ్రీ గణనాథం భజరే । చిత్త పరాశక్తియుతం ॥శ్రీ

అ. నాగయజ్ఞసూత్రధరం । నాదలయానందకరం ॥శ్రీ

చ. ఆగమాదిసన్నుతం । అఖిలదేవపూజితం
యోగశాలిభావితం । భోగిశాయిసేవితం
రాగద్వేషాదిరహిత । రమణీయహృదయముదితం
శ్రీ గురుగుహాసమ్మోదితం । చిన్మూలకమలస్థితం

## 2

శంకరాభరణ రాగము - తిశ్రలఘు తాళము

ప. శక్తిసహితగణపతిం । శంకరాది సేవితం వి
రక్తసకలమునివరసుర రాజవినుతగురుగుహం ॥శ

చ. భక్తాళిపోషకం భవసుతం వినాయకం
భుక్తిముక్తిప్రదం భూషితాంగం
రక్తపాదాంబుజం భావయామి ॥శ

## 3

శంకరాభరణ రాగము - రూపక తాళము

ప. గురుమూర్తే బహుకీర్తే
సురసేనాధిపతే ॥గు

అ. సురసేవిత శివభావిత

సుమతేఽనిశమవమాం (శ్రీ) ॥గు

చ. సరసీరుహాభావవందిత

సకలాగమనుతదేవ

సురపతి ధనుజాధిపతే

సురవరకరుణాజలధే

గిరిజాత్మజ షణ్ముఖభవ

గురుగుహా శరవణభవ (శ్రీ) ॥గు

## 4

పూర్వకల్యాణి రాగము - ఆది తాళము

ప. ఏకామ్రనాథం భజేహం (శ్రీ) ॥ఏ

అ. ఓంకారరూపం శివం ఓషధిమూలం వరం

కాలకాలహారం కర్మభేదకరం

జ్ఞానరూపసుతం (శ్రీ) గురుగుహాముదం ॥ఏ

చ. పంచాక్షరమంత్రరూపం ప్రసన్నరూపం ప్ర

పంచాతీతసద్యోజాతాది పంచముఖం సుముఖం

ప్రకటితకామకోటి పీఠస్థితం

ప్రసిద్ధముఖాదినుత కామాక్షీసహితం ॥ఏ

## 5

కాంభోజీ రాగము - ఆది తాళము

ప. మరకతవల్లీం మనసా స్మరామి
మదనజనకాది దేవపాలినీం ॥మ

చ. హరిహృదయవాసినీం మోహినీం
హరిహరపుత్రిజననీం నళినీం
కూరిదైత్యాదిబృందమర్దినీం
గురుగుహాదినుత వహ్నివాసినీం ॥మ

## 6

బేగడ రాగము - రూపక తాళము

ప. వల్లభనాయకస్య భక్తో భవామి
వాంఛితార్థదాయకస్య
వరమూషికవాహనస్య ॥వ

చ. పల్లవపదమృదుతరస్య
పాశాంకుశాది ధరస్య
మల్లికాబ్జచంపకాది హారస్య
మణిమాలస్య వల్లీవివాహకారణస్య
గురుగుహపూజితస్య కలికలమాలిని
కమలాక్షిసన్నుతస్య ॥వ

# 7

కమాస్ రాగము - తిశ్రత్రిపుట తాళము

ప. సారసదళనయన సంకటహారణ
హరేగోవింద మాం పాహి ॥సా

అ. నీరజాసనాది పూజితాంగ
శ్రీ రమాంతరంగ శుభాంగ
మురహార అభయప్రద ముకుంద
యాదవకులభూషణ మాధవ

చ. మాఘమాసోత్సవ ప్రభావ
మానితగురుగుహ వందితభవ
గోకులజనపాల గోపికామనోహార
గోవర్ధనధన ॥సా

# 8

శుద్ధధన్యాసి రాగము - ఆది తాళము

ప సుబ్రహ్మణ్యేన రక్షితోహం
అష్టాదశలోచనా ఖండేన ॥సు

అ. ప్రభ్రవామాదిపూజితపదేన
పురందర మనోల్లాసకరణేన

చ. కంకశైల విహారేణ సుఖేన
వల్లీదేవసేనారమణేన

అకారభృత్తేన ఆనందేన
భోగమోక్షదానేన నిత్యేన
వేంకటేశ్వర నామరూపేణ
విచిత్ర విశాఖమహోత్సవేన
శుకరహస్యప్రకాశ గురుగుహేన
కృత్తికాసుత శుద్ధధన్యేన ॥సు

## 9

తోడి రాగము - రూపక తాళము

ప. మహాగణపతిం వందే మాధవాద్యమరబృందం ॥మ
అ అహంతాదిరహితం శక్తివిహితం
ఆనందదం తమేకదంతం ॥మ
చ త్రిపురవధార్థం శివేన త్ర్యంబకేనార్చితం
ఉపనిషత్ ప్రతిపాదితం ఉమామహేశ్వరసుతం
కపిలవసిష్ఠాదినతం కంజజాదిభిరీడితం
కపిలం కృష్ణపూజితం కరివదనేన శోభితం
సుపర్ణవాహసేవితం సురగురుగుహభావితం
కపిత్థామ్రపనసజంబూకదళీఫలభక్తితం ॥మ

## 10

చక్రవాక రాగము - ఆది తాళము

ప గజాననయుతం గణేశ్వరం
భజామి సతతం సురేశ్వరం ॥గ

చ. గజేంద్రపూజిత విఘ్నేశ్వరం
గణాదివందిత పదపద్మయుగం
కుంజరభంజన చతురతరకరం
గురుగుహాదినుత ప్రణవాకారం

## 11

కాశిరామక్రియ రాగము - రూపక తాళము

ప. రామనాథం భజేహం రామచంద్రపూజితం ॥రా

అ. కామితఫలప్రద దేవం కోటితీర్థప్రభావం
కుమారగురుగుహమహితం కపిబృందాదిసన్నుతం ॥రా

చ. సేతుమధ్యగంధమాదనపర్వత విహారం
సదాపర్వతవర్ధినీ మనోల్లాసకరం
హస్తామలకగంధవరం హాటకమయచేలధరం
హత్యాదిపాపహరం హంసస్సోహకరం ॥రా

## 12

దేవక్రియ రాగము - ఆది తాళము

ప లలితాంబికాం చింతయామ్యహం
శ్రీ గురుగుహపూజిత పదాంబుజాం ।ల

అ. త్రిలోకరాజ్ఞీం దీనరక్షణీం
త్రికోణవాసినీం భండమర్దినీం ॥ల

చ. కళామాలినీం కాత్యాయనీం
కంజలోచనీం కనకమాలినీం
పాలితమంత్రిణ్యాది సమూహాం
పశుపతిహృదానందకర మోహాం ॥ల

## చౌకవర్ణము

### తోడి రాగము - ఆది తాళము

ప. రూపము జూచి వలచి వచ్చితిని
కోపము సేతురా సామి యింత ॥రూ

అ. తాపత్రియహరుడై వెలయు శ్రీ
త్యాగరాజసామి యిదేమి ॥రూ

చ. మారకోటిసుందరాకార ॥రూ

## దరువు

### శ్రీరంజని రాగము . రూపక తాళము

ప నీసాటిదైవమెందు లేదని మరులుకొంటిరా
నీదానరా నన్నేలరా (మొ కెరా-దా ॥నీ

అ. వాసవాద్యమరులెల్ల
వంమ్రి స్వరూపమెత్తి
వాసుదేవు గర్వమణచి
వరుసగా నమరు శ్రీపుర
వాసదాస చిద్విలాస
వల్లికేశ జగదీశ

## ముక్తాయి స్వరం

నీమీదనే మిగుల వలపు
సొంపుగలుపు గోలుపు
మనంబుతో నిజంబుగా బయలుదేరి
హాయలుమీరి చెలిమికోరి వలచినాను
బిరాన బహు వరాలొనగు ॥నీ

# నవావరణ కీర్తనల వ్యాఖ్యానము

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమామ్
అస్మదాచర్యపర్యంతాం వందేగురుపరంపరామ్ ॥

సదాత్మధ్యాననిరతం విషయేభ్యః పరాఙ్ముఖమ్
నౌమిశాస్త్రేషునిష్ణాతం చంద్రశేఖరభారతీమ్ ॥

శ్రీగుర్వవిచ్ఛిన్న పరంపరాయాం
భూమండలాచార్యకసార్వభౌమాన్
వ్యాఖ్యానసింహాసనపట్టభద్రాన్
భజేగురూన్ శృంగపురీమఠేశాన్ ॥

ఓంనమోబ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో
వంశర్షిభ్యో నమోగురుభ్యః ॥
సర్వోపప్లవరహితప్రజ్ఞాన ఘనప్రత్యగర్థో
బ్రహ్మైవాహమస్మిసోఽహమస్మి బ్రహ్మాహమస్మి ॥

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కర్ణాటక సంగీత రత్న త్రియములోనివాడు. ఆయనకీర్తనలలోని ప్రత్యేక లక్షణ ములను గురించి పీఠికయందు వివరింపబడినది. ఆయనరచించిన శ్రీ కమలాంబికానవావరణ కీర్తనల గురించి విశేషాంశ రహస్యాంశ వ్యాఖ్యానమిది.

శ్రీనవావరణ కీర్తనలు మొత్తము పదునొకండు. మొదటిది ధ్యానకీర్తన తరువాత రెండవకీర్తన మొదలు పదియవ కీర్తన వరకు (ఇవి తొమ్మిది కీర్తనలు) శ్రీ చక్రము నందలి తొమ్మిది ఆవరణలను వర్ణించు కీర్తనలు. పదునొకండవ కీర్తన (చివరది) మంగళకీర్తన. ఈకీర్తనలలో మరియొక వైచిత్రి కలదు. ధ్యానకీర్తనకాక తరువాతనున్న యెనిమిది కీర్తనలును (2నుంచి 9వరకు) ఎనిమిదివిభక్తులందున్నవి. (సంస్కృతభాష యొక్క విభక్తులు ప్రథమా, ద్వితీయా, తృతీయా, చతుర్థీ పంచమీ, షష్ఠీ, సప్తమీ, సంబోధనప్రథమా) తరువాత తొమ్మిదవ ఆవరణను గురించిన కీర్తన (యిది పదియవది) సార్వవిభక్తికము అనగాదీనియందు అన్నివిభక్తులును వచ్చినవి. ఈపద్ధతి ఉదాహరణ కావ్యపద్ధతి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు దేవీభక్తుడు. శ్రీ విద్యా దీక్షితుడు. శ్రీ దేవీపూజాయుత యంత్రమంత్రరహస్యవేత్త తాంత్రిక పరిభాషలో శ్రీ చక్రము (యంత్రము) శ్రీ జగన్మాతయైన రాజరాజేశ్వరీ లలితాపరాభట్టారికాదేవినిలయము. ఆమెయేమహాత్రిపురసుందరి. శ్రీ చక్రము అండపిండ బ్రహ్మాండములకును, శ్రీ విద్యా మంత్రములకు, పరదేవతకు సాంకేతికమైన చిహ్నము. అంతర్ముఖుడైన సాధకునికి స్వస్వరూపము. పరాది వైఖరీరూప మాతృకారూపముకూడ.

శ్రీ చక్రము శ్రీ విద్యామంత్రములు శ్రీ దేవీస్వరూపములే. శ్రీ దేవీమహత్తును శబ్దరూపమున శ్రీ విద్యా మంత్రములు వెల్లడిచేయును శ్రీ విద్య సమస్త మంత్రవిద్యలకు

మూలికస్థానమందున్న బ్రహ్మవిద్య. దీనిని మించిన ఉత్తమ మంత్రవిద్యలు లేవు. శ్రీ చక్రముకన్న ఉత్తమమైన యంత్రములు లేవు

శ్రీ చక్రమునందు నవ (తొమ్మిది) ఆవరణలు కలవు. వాటిని వివరించు సాంప్రదాయిక శ్లోకమిట్లున్నది.

బిందుత్రికోణ సమకోణ దశారయుగ్మ
మనస్వనాగదళషోడశ పత్రయుక్తం
వృత్తత్రయంచ ధరణీసదనత్రయంచ
శ్రీ చక్రరాజ ఉదితః పరదేవతాయాః

(త్రిపురతాపినీ ఉపనిషత్)

ఈ నవావరణలు అవరోహణ క్రమమున (1) బిందువు (2) త్రికోణము (3) అష్టకోణచక్రము (4) అంతర్దశారము (5) బహిర్దశారమను దశత్రికోణ చక్రము (6) చతుర్దశారము (7) అష్టదళ పద్మము (8) షోడశదళ పద్మము (9) భూపురము ఈ తొమ్మిది ఆవరణలే ఆరోహణాక్రమమున భూపురమునుండి బిందువు వరకు. ఈ నవావరణలయందు ఆవరణ దేవతలు కలరు.

శ్రీ విద్య యందు పూర్ణాభిషిక్తుడై, మంత్రశాస్త్ర వేత్తయగు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తొమ్మిది ఆవరణల పైన తొమ్మిది కీర్తనలు వ్రాసెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారు తన నవావరణ కీర్తనలకు శ్రీపుర కమలాంబికా నవావరణ కీర్తనలని పేరిడెను. శ్రీపుర మనగా తాంత్రికముగా శ్రీచక్రమని యర్థము.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు జన్మించిన గ్రామనామము తిరువారూరు. దానిని సంస్కృతీకరింపగా శ్రీ పురము. ఆ గ్రామమున వేంచేసియున్న అమ్మవారు కమలాంబిక. ఆమె శ్రీ లలితా త్రిపురసుందరీదేవి. చిచ్ఛక్తి కామకళాస్వరూపిణి. శ్రీచక్రమామెకు నిలయమైనది.

ధ్యానకీర్తన (1వ కీర్తన)

రాగము : తోడి తాళము : రూపకము

పల్లవి

కమలాంబికే ఆశ్రితకల్పలతికే చండికే
కమనీయారుణాంశుకే కరవిధృతశుకే
మామవ జగదంబికే ॥

అను పల్లవి

కమలాసనాది పూజిత కమలపదే బహువరదే
కమలాలయ తీర్థవైభవే శివే కరుణార్ణవే ॥కమలాంబికే

చరణం

సకలలోకనాయికే సంగీతరసికే
సుకవిత్వప్రదాయికే సుందరి గతమాయికే
వికళేబర ముక్తిదాననిపుణే అఘహరణే
వియదాదిభూతకిరణే వినోదచరణే అరుణే
సకలే గురుగుహకరణే సదాశివాంతఃకరణే
అకచటతపాదివర్ణే అఖండైకరసపూర్ణే ॥కమలాంబికే

దీని తాత్పర్యము :-

కమలాంబికా, ఆశ్రయించిన భక్తులకు కల్పవృక్షము వంటిదానా, చండికా, కమనీయమైన ఎఱ్ఱని అంశుకము ధరించినదానా, చేతియందు లీలాశుకము కలదానా, బ్రహ్మాది దేవతలచేత పూజింపబడినపాదకమలములు కలదానా, బహు వరములనిచ్చుదానా, కమలాలయ తీర్థవైభవము కలదానా, మంగళస్వరూపిణియైన శివా, కరుణాసముద్రురాలా, సకల లోకములకు నాయికా, సంగీత రసికురాలా, మంచికవిత్వమును వ్రాయు శక్తినిచ్చుదానా, మాయకు అతీతురాలయినసుందరీ, విదేహముక్తి నొసగు నిపుణురాలా, పాపములను హరించు దానా, ఆకాశాది పంచభూతములను చరణ కిరణములు కల దానా మనోహరమైన చరణములు కలదానా, అరుణాంబికా, సకలా, గురుగుహాకరణా, సదాశివాంతఃకరణా, అకచటతపాది వర్గమాతృకావర్ణ స్వరూపిణి, అఖండైకరస పరిపూర్ణా జగ, దంబికా నన్ను రక్షింపుము.

విశేషములు

ఈ కీర్తనలో కామకల్యాణ స్వరూపిణియైన కమలాంబిక నిర్గుణ స్వరూపిణియని సగుణ స్వరూపిణియని, సాకార నిరాకారయని సూచింపబడినది.

1 నిర్గుణత్వమును సూచించు పదములు : గతమాయే - (మాయాతీత) అఖండైక రసపరిపూర్ణ.

2 సగుణ నిరాకారత్వము : శివే (శివశక్తిస్వరూపం) చండికా, సుందరి, సకలా, జగదంబిక, సకలలోకనాయిక, అరుణ,

కరుణార్ణవ, మొ॥ పదములు

3 సగుణసాకారత్వము : కమలాసనాది పూజిత కమలపద, వినోదచరణ, వియదాది భూతకిరణ, కరవిధృతశుక, సంగీత రసిక, సదాశివాంతఃకరణ, కమలాలయ తీర్థవైభవ.

శ్రీ దేవికి మరి కొన్ని లక్షణములు చెప్పబడినవి.

అకచటతపాదివర్గః : వర్ణమాలయందు అ,క,చ,ట,త,ప,య,శ, అనునవి వర్గమున ఆది అక్షరములు. అకచటతపాది యనగా సకల వర్ణమాల యనియే భావార్థము. మరియు సూక్ష్మ మంత్రాక్షర రూపిణియనియు సూచన.

కరుణా రూపము : శ్రీ దేవియొక్క కరుణా రూపము కరుణా ర్ణవ. ఆశ్రిత కల్పలతిక, బహువరద, సుకవిత్వ ప్రదాయిక, వికళేబర ముక్తిదాన నిపుణ, అఘహారణ మొదలగు పదముల చేత వెల్లడింప బడినది.

సదాశివాంతఃకరణత్వము : సృష్టిచేయుట మొదలగు పంచ కర్తృత్వములు, అనుగ్రహ కర్తృత్వము - యివియన్నియు శ్రీదేవి కృపాస్వరూపములే. సదాశివాంతః కరణత్వము ధ్యేయ రూపముగను, అధిష్ఠానరూపముగను వచింపబడినది.

గురుగుహాకరణే : పరమశివునికి ప్రణవముపదేశించిన కుమార స్వామికి కారణభూతురాలు - తల్లి. 'గురుగుహ' అనునది శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి కృతి రచనాముద్ర. ఆయన ఇష్టదైవము సుబ్రహ్మణ్య స్వామి ఆయనకు తిరుత్తనిలో. శ్రీసుబ్రహ్మణ్యస్వామి దర్శనము లభింపగా ఆయన పరవశు డై "శ్రీ నాథాది గురుగుహో జయతి" అని గానము చేసెను.

నాటినుండి ఆయన సంగీత రచనలకు గురుగుహ ముద్ర ప్రారంభమైనది.

విదేహముక్తి : ఇది విదేహముక్తి. "ఈశ్వరానుగ్రహాత్ పుంసాంఅద్వైతవాసనా" అనియు, "జ్ఞానాదేవతు కైవల్యమ్" అనియుప్రమాణ వాక్యములుండుటవలన శ్రీ దేవిని 'ముక్తి దానసిపుణ' అని చెప్పుట సమంజసమగుచున్నది.

ప్రథమావరణము

శ్రీ చక్రమునందు. ఆరోహణక్రమమున మొదటి ఆవరణము భూపురము. భూపురమునందు మూడు విభాగములు కలవు. శుక్ల వర్ణముకల మొదటి భూపురమున వామా, జ్యేష్ఠా, రౌద్రీ, అంబికా, పశ్యంతీ, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శాంతా శక్తులు నవముద్రాకారములను (సర్వసంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశ, సర్వఖేచరి, సర్వబీజ, సర్వయోని) పొంది వసించుచున్నవి. రక్త వర్ణముగల ద్వితీయ భూపురమున (మధ్య) బ్రాహ్మి మాహేశ్వరీ, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండా, మహాలక్ష్మి అనుమాతృకలున్నారు. శ్రీదేవి సమిష్టి రూపమునమన్న సప్తధాతువులే యీ మాతృకారూపములు, పీత వర్ణముకల తృతీయ భూపురమున శ్రీవిద్యకు సంబంధింపని మంత్రములు కమనీయమైన రూపములతోనున్నవి.

సమిష్టి భూపురము చతురస్రాకృతి. దీనికి త్రైలోక్య మోహనచక్రమని పేరు. లకారము దీనిప్రకృతి. తత్త్వము పృథివీ తత్త్వము ఇచ్చట దశసిద్ధులు (అణిమా, లఘిమా,

మహిమా, ఈశిత్వ, వశిత్వ, ప్రాకామ్య,భుక్తి, గరిమా, ప్రాప్తి సర్వకామ) దేవతామూర్తులై యున్నారు. వీరు శుక్లవర్ణము కలవారు. అంకుశపాశపద్మయుగ్మ ధారిణిలు ఈ ఆవరణ దేవతలు ప్రకట యోగినులు. చక్రేశ్వరి త్రిపురాదేవి రసము శృంగారము.

6 3 10 7 4 | 6 3 10 7 4 | 6 2 3 7

2 5 1 9 8 | 2 5 1 9 8 | 5 1 4 8

ప్రథమ భూపురము   ద్వితీయ భూపురము (మధ్య)   తృతీయ భూపురము

కీర్తన

రాగము : ఆనందభైరవి   తాళము : త్రిపుట

పల్లవి

కమలాంబా సంరక్షతు మాం హృత్కమలనగర నివాసినీ

అనుపల్లవి

సుమనసారాధితాబ్జముఖీ సుందరమనఃప్రియసఖీ
కమలజానందబోధసుఖీ కాంతాతారపంజరశుకీ ॥కమలాంబా

చరణం

త్రిపురాదిచక్రేశ్వరీ అణిమాది సిద్ధేశ్వరీ నిత్యాకామేశ్వరీ
క్షితిపురత్రైలోక్యమోహనచక్రవర్తినీ ప్రకటయోగినీ

సురరిపుమహిషాసురాది మర్దినీ నిగమపురాణాది సంవేదినీ
త్రిపురేశీ గురుగుహజననీ త్రిపురభంజనరంజనీ
మధురిపుసహోదరీ తలోదరీ త్రిపురసుందరీ మహేశ్వరీ
॥కమలాంబా

దీని తాత్పర్యము :

నాహృదయకమలమందు నివసించుచున్నట్టి కమలాంబ, సుమనసారాధితాబ్జముఖి, సుందరుడైన శివునికి ప్రియసఖి, బ్రహ్మానంద బోధసుఖి, ఓంకారపంజరశుకి, త్రిపురాది చక్రేశ్వరి, అణిమాది సిద్ధేశ్వరి, నిత్యాకామేశ్వరి, భూపుర త్రైలోక్య మోహనచక్రవర్తిని, నిగమపురాణాది సంవేదిని, త్రిపురేశి, గురుగుహజనని, త్రిపురభంజనుడైన శివునికి రంజని, మధురిపుడైన నారాయణునికి సహోదరి, తలోదరి, త్రిపురసుందరి, మహేశ్వరి నన్ను రక్షించునుగాక.

సుమనసారాధిత - దేవతలు, ఋషులు, జ్ఞానులచేత ఆరాధింపబడినది.

సుందరమనఃప్రియసఖీ - సుందర-సుందరేశ్వరుని ప్రియసఖీ (మీనాక్షి యని సూచన)

కమలజానందబోధసుఖీ - బ్రహ్మానందబోధచేత అశుభములకు అనర్థము కలిగించునది. (సుఖీ - సూక్ష్మఖనతి అశుభమితిసుఖం-ఖనం అవధారణే)

తారపంజరశుకీ - ఓంకారపంజరశుకీ-స్వయంప్రకాశవస్తువు,

త్రిపురాది చక్రేశ్వరీ - త్రిపురాదేవి మొదటి ఆవరణమైన భూపురచక్రమునకు ఈశ్వరి. త్రిపురాదేవి మొదలుగా తొమ్మిది

చక్రముల ఈశ్వరియని భావము.

అణిమాదిసిద్ధేశ్వరీ - అణిమాదిగాసిద్ధుల (పదిసిద్ధులు పైన చెప్పబడినవి)కు ఈశ్వరి. ఈదశసిద్ధులను ప్రదానముచేయగలది.

నిత్యాకామేశ్వరీ - శ్రీవిద్య యనబడుచిద్విద్యలో పంచదశ బీజములను కామేశ్వరీ మొదలగు 15 నిత్యలుగా నున్నవని సంప్రదాయము. ఆపంచదశ బీజవర్ణములు పరంజ్యోతి స్వరూప మైన కామకల అను నామాంతరముకల ధ్రువకలనుండి ఆవిర్భ వించినవి. పంచదశీమంత్ర స్వరూపమైన పంచదశ బీజములు పంచదశనిత్యలై శుద్ధపాడ్యమి మొదలు అమావాస్య వరకు తిథిరూపములుగా నున్నవి. బహుళపక్షమునందిదియే మరల వెనుక వరుసను వచ్చును. పదునైదునిత్యలు క్రమముగా- కామేశ్వరీ, భగమాలినీ, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసినీ, మహావజ్రేశ్వరి, శివదూతీ, త్వరితా, కులసుందరీ, నిత్యా, నీలపతాకా, విజయా, సర్వమంగళా, జ్వాలామాలినీ, చిత్రా, అనునవి.

క్షితిపురత్రైలోక్యమోహనచక్రవర్తినీ-త్రైలోక్య మోహన చక్రమను పేరుగల భూపురమునందు సంచరించు దేవతాస్వ రూపిణి.

ప్రకటయోగినీ - భూపుర ఆవరణ దేవతలకు ప్రకటయోగిను లనిపేరు. తద్దేవతారూపిణి శ్రీదేవి.

సురరిపు మహిషాసురాదిమర్దినీ - దేవతలకు విరోధులైన మహిషాసురాదులను సంహరించిన శ్రీదేవి (మహిషాసుర శుంభ నిశుంభాదిరాక్షసులు దేవతలకు విరోధులు)

నిగమపురాణాది సంవేదినీ - వేదాగమ పురాణాది సంవేదిని.

త్రిపురేశీ - త్రైలోక్య మోహన చక్రేశ్వరి

గుహగుహజనని - కుమారస్వామికి తల్లి.

త్రిపురభంజనరంజని - త్రిపురాసుర సంహారకుడైన శివునికి ఆనందము కూర్చినది.

మధురిపుసహోదరి - నారాయణుని సహోదరి.

తలోదరి - (అతల, వితల, సుతల ...) ఉదరమునందు చతుర్దశ భువనములును కలది. జగజ్జనని (లలితాసహస్రనామావళి లోని నామము)

మహేశ్వరి - మహేశ్వరుని జాయ.

ఈ కీర్తనలో పరదేవత నామములు ప్రథమావిభక్తిలో నున్నవి. (సు-)

తత్త్వవిమర్శనము

కమలాజానందము - బ్రహ్మానందము-చతుర్ముఖ ప్రజాపతి హిరణ్యగర్భ ఆనందము. ఇది సాపేక్షిక ఆనందమే. తైత్తిరీయ ఉపనిషత్తు ఆనందవల్లియందు ఆనందవివరణము కలదు.

ప్రథమావరణ దేవతలు జాగ్రదవస్థయందు మనోవృద్ధిచేయు దేవతలు. అందుచేత వీరికి ప్రకటయోగినులని పేరు.

అణిమాదిసిద్ధిదేవతలు - జీవికిలభించు శృంగారాది రసములు. "నియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయః" (భావనోపనిషత్తు) బ్రాహ్మిమొదలగు అష్టమాతృకలు : కామ క్రోధలోభ మోహ మదమాత్సర్యపుణ్య పాపములు : "కామ

క్రోధలోభ మోహమదమాత్సర్యపుణ్యపాపమయాబాహ్యా దశ్శిష్టశక్తయః (భావనోపనిషత్తు)
సర్వసంక్షోభిణీ మొ॥ ముద్రాశక్తులు : మూలాధార, స్వాధిష్ఠాన మణిపూరక, అనాహత, విశుద్ధ, లంబికాగ్రి, ఆజ్ఞాసహస్రార ద్వాదశాంతములు తొమ్మిదియు తొమ్మిది ముద్రా దేవతలు. "ఆధారనవకంముద్రాశక్తయః" (భావనోపనిషత్తు)

రెండవ ఆవరణ కీర్తన

రాగము : కల్యాణి  తాళము : ఆది

పల్లవి

కమలాంబాం భజరే రేమానస
కల్పితమాయాకార్య త్యజరే

అను పల్లవి :

కమలావాణీ సేవితపార్శ్వాం కంబుజయగ్రీవాం నతదేవాం
కమలాపురసదనాం మృదుగదనాం కమనీయరదనాం కమల
నయనాం ॥కమలాంబాం

చరణము

సర్వాశాపరిపూరక చక్రస్వామినీం పరశివకామినీం
దూర్వాసార్చితగుప్తయోగినీం దుఃఖధ్వంసినీం హంసినీం
నిర్వాణనిజసుఖదాయినీం నిత్యకల్యాణీం కాత్యాయనీం
శర్వాణీం మధుపవిజయవేణీం సద్గురుగుహజననీం
నిరంజనీం గర్వితభండాసుర భంజనీం కామాకర్షిణ్యాది రంజనీం
నిర్విశేషచైతన్యస్వరూపిణీం ఉర్వీతత్త్వాది స్వరూపిణీం
॥కమలాంబాం

తాత్పర్యము :

కమలావాణీసేవిత పార్శ్వ అయిన శ్రీదేవిని, కంబుజయ గ్రీవఅయిన శ్రీదేవిని, దేవతలచేత నమస్కరింపబడిన శ్రీదేవిని, కమలాపురమను తిరువారూరు నందు వేంచేసియున్న శ్రీదేవిని, మృదువైనవాక్కుగల శ్రీదేవిని, కమనీయమైన దంతపంక్తికల శ్రీదేవిని, కమలములవంటి నేత్రములుకల శ్రీదేవిని, సర్వాశా పరిపూరక చక్రస్వామినిఅగు శ్రీదేవిని, శివకామినియగు శ్రీదేవిని దూర్వాసునిచేత అర్చింపబడిన గుప్తయోగినియగుదేవిని దుఃఖ ధ్వంసినియగు శ్రీదేవిని, హంసినియగు శ్రీదేవిని నిర్వాణనిజసుఖ దాయినీయగు శ్రీదేవిని, నిత్యకల్యాణియగు శ్రీదేవిని, కాత్యాయనియగు శ్రీదేవిని, శర్వాణియగు శ్రీదేవిని, తుమ్మెదలసమూహమువంటి అందమగు కేశపాశముగల శ్రీదేవిని, సద్గురుగుహ జననియగు శ్రీదేవిని, నిర్విశేషచైతన్య స్వరూపిణియగు శ్రీదేవిని, ఉర్వీతత్త్వాదిరూపిణియగు శ్రీదేవిని, నిరంజనియగు శ్రీదేవిని, భండాసురాది రాక్షసుల గర్వముహరించిన శ్రీదేవిని, కామాకర్షిణ్యాది ద్వితీయావరణ దేవతలకు సంతోషమిచ్చు శ్రీదేవిని ఓ మానసమా భజింపుము. మాయాకార్యములను త్యజింపుము.

విశేషములు :

ఈ కీర్తనలోని శ్రీదేవియొక్క నామములు ద్వితీయా విభక్తియందున్నవి. (అయ్) దీనియందు రెండవ ఆవరణ దేవతల ప్రసక్తియున్నది.

ఈ కీర్తనయందు సగుణ సాకారములు, సగుణ నిరాకారములు, నిర్గుణాత్మకములు, శ్రీ చక్రసంబంధమైనవి శ్రీదేవినామములు ఉపయోగింపబడినవి.

సగుణసాకారనామములు : కమలావాణీసేవితపార్శ్వాం, కంబుజయగ్రీవాం, కమలాపురసదనాం, మృదుగదనాం, కమనీయరదనాం, కమలవదనాం, మధుపవిజయవేణీం.

సగుణనిరాకార నామములు : పరమశివకామినీం, దుఃఖ ధ్వంసినీం, శర్వాణీం, నిత్యకల్యాణీం, కాత్యాయనీం, సద్గురుగుహజననీం, గర్వితభండాసుర భంజనీం, ఉర్వీతత్త్వాది స్వరూపిణీం.

నిర్గుణ నామములు : హంసినీం, నిర్వాణసుఖ ప్రదాయినీం, నిరంజనీం, నిర్విశేషచైతన్యరూపిణీం.

శ్రీచక్ర సంబంధమైన నామములు : సర్వాశాపరిపూరకచక్రస్వామినీం, దూర్వాసార్చిత గుప్తయోగినీం, కామాకర్షిణ్యాదిరంజనీం, కాత్యాయనీం.

విశేషార్థ వివరణ :

కమలావాణీసేవితపార్శ్వాం : ఈ నామము లలితాసహస్రనామములందున్న సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా అను 614వ నామమునకు ప్రతి

(చామరాభ్యాం సహితే సచామరే తాదృశీభ్యాం రమావాణీభ్యాం లక్ష్మీ సరస్వతీభ్యాం (కమలావాణీభ్యాం) సవ్యే దక్షిణే క్రమేణ సేవితా వీజితా)

వింజామరలనువూనిన లక్ష్మీసరస్వతులచే పార్శ్వ భాగము

లందు సేవింపబడినది. పీవబడినది. పిండితార్థమేమనగా లక్ష్మీ దేవియు, సరస్వతీదేవియు వేరువేరుగా నేయే వరములు అను గ్రహ కటాక్షములను ప్రసాదింపకలుగుచున్నారో ఆ సర్వము శ్రీదేవి ప్రసాదింకగలదని.



రెండవ ఆవరణ
షోడశదళ చక్రము

సర్వాశాపరిపూరకచక్రస్వామిని : రెండవ ఆవరణకు సర్వాశా పరి పూరక చక్రమని పేరు. ఆచక్రేశ్వరి సర్వాశాపరిపూరక చక్రస్వామిని. ఈమె త్రిపురసుందరి. ఈ చక్రము సకారప్రకృతి కలది. చంద్రికలా స్వరూపాత్మకమైనది. శ్వేతవర్ణము కలది. అమృతరససావము కలది. ఇచట పదునారుమంది (షోడశ) దేవతలున్నారు. వారునిత్యాకళలు. వారు కామాకర్షిణీ, బుద్ధ్యాకర్షిణీ, అహంకారాకర్షిణీ, శబ్దాకర్షిణీ, స్పర్శాకర్షిణీ, రూపాకర్షిణీ, రసాకర్షిణీ, గంధాకర్షిణీ, చిత్తాకర్షిణీ, ధైర్యాకర్షిణీ, స్మృత్యాకర్షిణీ, నామాకర్షిణీ బీజాకర్షిణీ, ఆత్మాకర్షిణీ, అమృతాకర్షిణీ, శరీరాకర్షిణీ అనువారు. వీరుగుప్తయోగినులు. అకారాది 16 స్వరములుగానున్న షోడశదళములందు వీరు కలరు. ఇచటరసము వీరము.

పరమశివకామినీం : పరదేవత చిదానందరూపిణి 'సోఽకామయ' అను శ్రుతిప్రమాణముచేత ఆమె కామకలాస్వరూపిణి.

దూర్వాసార్చితగుప్తయోగినీం : రెండవ ఆవరణమునందున్న

దేవతలకు గుప్తయోగినులని పేరు. వీరు శ్రీదేవి స్వరూపిణులే. దూర్వాసునిచేత అర్చింపబడిన గుప్తయోగినీ స్వరూపిణియగు శ్రీదేవియని భావము. దూర్వాసుడు పదురెండుమంది శ్రీవిద్యా చక్రవర్తులలోనొకడు. ఆయన మంత్రద్రష్ట. పంచదశ మంత్రమునకు దూర్వాసుని ప్రత్యేక రూపమున్నది. ఆయన లలితాస్తవరత్నమను శ్రీపురవర్ణనమును, శక్తిమహిమ్న స్తోత్రమును రచించినవాడు.

దుఃఖధ్వంసినీం : సకలమైనదుఃఖములను అనర్థములను నాశనము చేయునది. అనర్థములు అజ్ఞానమువలన. అజ్ఞానము పోగొట్టి జ్ఞానమునిచ్చుటవలన దుఃఖము ధ్వంసమగుచున్నది.

హంసినీం : ఆత్మ మంత్రస్వరూపిణి. 'అహం సః' ఇది హంస మంత్రముయొక్క లక్ష్యార్థము. అహం సః-సోహామస్మి. హంస స్సోహామస్మి-ఇదిమహావాక్యమే. ఆత్మబ్రహ్మైక్యానుభవమును స్వయంప్రకాశనము చేయునది హంసినీం.

నిర్వాణనిజసుఖప్రదాయినీం : స్వకీయమైన నిత్యానందము నిచ్చి మోక్షమునిచ్చునది. లలితాసహస్ర నామావళియందు 727వ నామము శివజ్ఞానప్రదాయిని అనికలదు. శివసంబంధమైన జ్ఞానమును గొప్పగానిచ్చునది. ఈ భావమునే తెలుపుటకీ పదములు.

నిత్యకల్యాణి : నాశరహిత సుఖస్వరూపిణి. నాశరహితసుఖమే ఆనందము. మోక్షము. శ్రీదేవి 'నిత్యకల్యాణశీల' అనిమంత్ర ధ్యాన శ్లోకము.

కాత్యాయనీం : శ్రీ లలితాసహస్ర నామావళియందు 556వ

నామము. సర్వదేవ తేజస్సమూహాత్మిక యగుటచే దేవికీసంజ్ఞ కలిగెను వామనపురాణమందు "తచ్చాపి తేజోవరము త్తమం మహ న్నామ్నా పృథివ్యాం అభవత్ప్రసిద్ధం కాత్యాయనీత్యేవ తదా బభౌసా నామ్నాచ తే నైవ జగత్ప్రసిద్ధా" దేవీపురాణము నందు "కం బ్రహ్మ కం శిరః ప్రోక్తం అశ్మసారంచ కం మతం ధారణా ద్వాసనాద్వాపి తేన కాత్యాయనీ మాతా" (కం అన బ్రహ్మ, శిరస్సు, అశ్మసారము. దానిని ధరించుటచేతను వసించుటచేతను ఆమె కాత్యాయని అగుచున్నది.

శర్వాణి - అష్టమూర్తియగు శివునకు శర్వుడనిపేరు. శర్వుని పత్ని శర్వాణి.

నిరంజనీం – అంజనమనగా అజ్ఞానము. అజ్ఞానమును పోగొట్టిన జ్ఞాన స్వరూపిణి.

గర్వితభండాసుర భంజనీం : గర్వముచేత మత్తుడైన భండుడను రాక్షసునిఅణచినట్టి శ్రీదేవి. భండాసురుని వృత్తాంతము లలితోపాఖ్యానమున సవిస్తరముగనున్నది. భండాసురునిగురించిప్రసక్తి గలనామములు లలితాసహస్రనామమున నాలుగునామము లున్నవి. (65, 72, 74, 79)

మన్మథుడు దహింపబడుటవలన నేర్పడిన బూడిదన చిత్రకర్ముడైన విఘ్నేశ్వరుడు చిత్రాకారమైన బూడిదను చేసెను. వానినిచూచి బ్రహ్మ "భండ భండ" (ఆశ్చర్యమాశ్చర్యము) అనుటచే వానికి భండుడని పేరువచ్చెను. రుద్రకోపాగ్నివలన పుట్టిన భండుడు రౌద్రస్వభావము కలవాడై రాక్షసుడయ్యెను. అతని గర్వమును నశింపచేసినది శ్రీదేవి.

భండయనగా లజ్జలేనివాడని భావము ప్రకృతియందు జీవ భావము పొందినదేహి. అనగా సుఖదుఃఖాదులచే పీడింపబడు దేహి. అట్టివాని గర్వమును పోగొట్టునది జ్ఞానప్రదాయిని. ఈ విషయము శివసూత్రములందున్నది.

కామాకర్షిణ్యాది రంజనీం - రెండవ ఆవరణయగు షోడశదళ చక్రమందు ఒక్కొక్క దళమందు ఒక్కొక్క దేవత కలదు. వారు కామాకర్షిణి మొదలగువారు. వీరిపేర్లు పైన చెప్పబడినవి. ఈ కామకర్షిణ్యాది ఆవరణదేవతలకు ఆనందమును కూర్చునట్టి చక్రేశ్వరి, అధిష్ఠాత్రి అనిభావము.

నిర్విశేషచైతన్యరూపిణి : విశేషమనగా గుణములేని ఉపాధి. గుణములులేని ఉపాధిలేని అభేదజ్ఞానమునకు 'నిర్విశేషచిత్' అనిపేరు. దీనిస్వరూపమే నిర్విశేషచైతన్యం. తద్రూపిణి. అవిద్యానివారకత్వం రూపంసామర్థ్యం చైతన్యాపరపర్యాయం వా చిచ్ఛక్తిః.

'చిచ్ఛక్తిః పరమేశ్వరస్య విమలాచైతన్యమేవోచ్యతే' (పరమేశ్వరుని నిర్మలమైన చైతన్యమే చిచ్ఛక్తి యనబడుచున్నది.) అని సంక్షేపశారీరకాచార్యులనిరి. దేవీభాగవతమున ప్రథమశ్లోకములందు "సర్వచైతన్యరూపాంతాం ఆద్యాం విద్యాంచ ధీమహి బుద్ధింయా నః ప్రచోదయాత్" అనికలదు. (సర్వచైతన్యరూపమైనది. ఆద్యమైన విద్యను ప్రార్థింతును. మా బుద్ధులను ప్రేరేపించునుగాక గాయత్రి) ఆమెఆనందమని శ్రుతి (సైషానందస్య మీమాంసా భవతి) ప్రమాణము. (ఆనందస్య బ్రహ్మణః సైషాచిద్రూపా శక్తిర్మీమాంసా

భవతి విమర్శాత్మికాభవతీతి శంకరారణ్యాచరణైః విద్యారత్న వ్యాఖ్యానదర్శనాత్) శంకరారణ్యాచరణులు విద్యారత్న వ్యాఖ్యానమందు "ఆనందబ్రహ్మయొక్క చిద్రూపమే దేవి. ఆమెయే విమర్శ" అని చెప్పిరి. "చైతన్యరూపాశక్తిః" అని గౌడపాదులశక్తి సూత్రము

ఉర్వ్యాదితత్త్వస్వరూపిణీ: శివుడు మొదలు పృథివ్యంతము లైన 36 తత్త్వముల స్వరూపిణి. ఈ ముప్పదియారు తత్త్వములు సచ్చిదానంద రూపుడైన బ్రహ్మనుండి పుట్టినవి. కావున సచ్చిదానందరూప బ్రహ్మమని భావము. ఈ తత్త్వములు ఆత్మతత్త్వ విద్యాతత్త్వ, శివతత్త్వములుగా విభాగింపబడినవి.

"కామిక" యందు "ఆగమవేత్తలు పృథివ్యాదులగు ముప్పదియారు తత్త్వములు పరబ్రహ్మకు శుక్లమజ్జ అస్థిరూపములు దాల్చిన తత్త్వాకారము." అని (పృథివ్యాదీనిషట్త్రింశత్తత్త్వాని ఆగమవేదిభిః ఉక్తాన్యముష్యతత్త్వధ్వా శుక్లమజ్జాస్థిరూపధృత్) కావున ఆ ధాతురూపము కావచ్చును.

రహస్య విషయము: రెండవ ఆవరణ స్వప్నావస్థలోని మనోవృద్ధికి సంబంధించినది. స్వప్నమునందు తృప్తి విషయము సూక్ష్మము. గుప్తము. గుప్తముగుటవలన యీ ఆవరణ దేవతలకు గుప్తయోగినులని నామాంతరము.

మనస్సు-మనోవిహారము (కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ పంచతన్మాత్రలు)కలపి 16. ఇవికామాకర్షిణ్యాది దేవతలుగా భాసించుట శాస్త్రసిద్ధమైన విషయము. స్వప్నావస్థాభిమాని జీవుడు తైజసుడనబడుచున్నాడు.

తృతీయావరణ కీర్తన :
రాగము : శంకరాభరణము   తాళము : రూపకము
(తిస్రజాతి ఏకతాళమని ఒక భావము)

పల్లవి
శ్రీ కమలాంబికయా కటాక్షితోఽహం
సచ్చిదానందపరిపూర్ణ బ్రహ్మాస్మి

అను పల్లవి
పాకశాసనాది సకలదేవతా సేవితయా
పంకజాసనాది పంచకృత్యకృద్భావితయా
శోకహరణచతురపదయా మూకముఖ్యవాక్ప్రదయా
కోకనదవిజయపదయా గురుగుహతత్రైపదయా ॥శ్రీకమలా

చరణం
అనంగకుసుమాద్యష్టశక్త్యాకారయా
అరుణవర్ణసంక్షోభణ చక్రాకారయా
అనంతకోట్యండనాయక శంకరనాయికయా
అష్టవర్గాత్మకగుప్తతరయా పరయా
అనంగాద్యుపాసితయా అష్టదళాబ్జస్థితయా
ధనుర్బాణధరకరయా దయాసుధాసాగరయా ॥శ్రీకమలా

తాత్పర్యము :

ఇంద్రాది సకల దేవతాసమూహముచే సేవింపబడిన శ్రీదేవిచేత, పంచకృత్యపరాయణులైన బ్రహ్మాదులచే ధ్యానింపబడుచున్న శ్రీదేవిచేత, శోకమును హరించు చాతుర్యముగల పదములుగల శ్రీదేవిచేత, మూకకవి మొదలగువారికి వాక్కును

అనుగ్రహించిన శ్రీదేవిచేత, పద్మములను జయించిన పదములు గల శ్రీదేవిచేత, కుమారస్వామి ఉపదేశించిన తత్ పద లక్ష్యార్థమైన శ్రీదేవిచేత, అనంగకుసుమాది అష్టశక్తుల ఆకారముకల దానిచేత, అరుణ వర్ణముగల సంక్షోభణ చక్రాకారముకల శ్రీదేవిచేత, అనంతకోటిబ్రహ్మాండ నాయకుడైన శంకరునికి నాయికియగు శ్రీదేవిచేత, అష్టవర్గాత్మక మాతృకావర్ణ స్వరూపముగల గుప్తతరయోగినియైన శ్రీదేవిచేత, తనకన్నపై వారులేని శ్రీదేవిచేత, మన్మథుడు మొదలగువారిచేత ఉపాసింపబడిన శ్రీదేవిచేత, మూడవఆవరణయగు అష్టదళ పద్మమునందు వసించు శ్రీదేవిచేత, ధనుర్బాణములను ధరించిన శ్రీదేవిచేత, దయామృతసాగరయగు శ్రీదేవిచేత, శ్రీకమలాంబిక చేత నేను కటాక్షింపబడినవాడను. నేను సచ్చిదానందపరిపూర్ణ బ్రహ్మమును.

ఈ కీర్తన మూడవ ఆవరణకు సంబంధించినది. ఇది మూడవ విభక్తియందున్నది. (టా)




మూడవ ఆవరణము అష్టదళ పద్మము. దీనికి సర్వ సంక్షోభిణీచక్రమని పేరు. హాకార ప్రకతి కలది. జపాకుసుమ మిత్రము. ఇచట నెనిమిది దేవతలున్నారు. ఒక్కొక్కరు దళమునందొకరు. వారు అనంగ కుసుమా, అనంగమేఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగ

మాలినీ అనువారలు. వీరు జపాకుసుమ సంకాశమైన దేహ కాంతి కలవారు. ఈ ఆవరణ దేవతలకు గుప్తతరయోగినులని పేరు. ఈ చక్రేశ్వరి త్రిపురసుందరి. రసము కరుణ.

శ్రీ చక్రమే శరీరముగానున్న సంవిద్రూప పరదేవత యొక్క అవ్యక్త మహత్తత్త్వాహంకారములు భూతతన్మాత్రా పంచకము దేవతామూర్తులై యీ ఆవరణ దేవతలైరి.

విశేషములు :

పాకశాసనాది సకలదేవతా సేవితయా- ఇంద్రాది సకల దేవతలచేతను శ్రీదేవి సేవింపబడినది. రాక్షసులవలన తమకు ఆపదలు వచ్చినప్పుడు ఇంద్రాదులైన దేవతలు శ్రీదేవిని ప్రార్థించి ఆమె కృపచేత తమకష్టములను నివారింపచేసికొనుట ప్రసిద్ధము. బ్రహ్మాండ, మార్కండేయ, కాళికా పురాణము లందును దేవీభాగవతము నందును యీ గాథలు కలవు. "పురందరాది బృందారక బృందసేవిత" అని కాళిదాసు ప్రయోగము.

పంచకృత్యకృద్భావితయా : విశ్వముయొక్క సృష్టి, రక్షణ, నాశ, తిరోధాన, అనుగ్రహములనెడు పంచకృత్యములను చేయువారు పంచబ్రహ్మలు. యజ్ఞవైభవఖండమందు "ఏక ఏవ శివస్సాక్షాత్ సత్యజ్ఞానాది లక్షణః వికారరహితః శుద్ధః స్వశక్త్యాపంచధాస్థితః" సృష్ట్యాది పంచకృత్యములలో శివుడు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములను పంచరూపుడాయెనట అట్లే గరుడపురాణమునందు విష్ణువు పంచ రూపములుగా (వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న,

అనిరుద్ధ, నారాయణ) వాయెనని కలదు.

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు పంచబ్రహ్మలని త్రిపురాసిద్ధాంతమందున్నది. ఈ పంచబ్రహ్మలు తమ తమ కృత్యములు చేయునప్పుడు శ్రీదేవిని భావించు చుందురు.

శోకహరణచతురపదయా : శోకమనగా దుఃఖము. దుఃఖము సాంసారికము. దుఃఖమును హరించు సామర్థ్యము కలిగిన పాదములు కలిగినది శ్రీదేవి. సంసారబాధలనుండి ముక్తియే (దుఃఖమునుండి విముక్తి) మోక్షమని గౌతమసూత్రము "తదత్యంత విమోక్షోపవర్గ" ఇతి గౌతమసూత్రమ్, ముక్తుడు దుఃఖమునుండి విడివడినవాడని శ్రుతి ప్రమాణము. "దుఃఖేనాత్యంతశ్చరతీ"తి శ్రుతేశ్చ.

అంబాచరణములు జ్ఞానమూర్తులు. జ్ఞానము అజ్ఞానమును (దుఃఖమును) పోగొట్టును.

గురుగుహ తత్త్రెపదయా 'తత్త్వమసి' అను మహావాక్యమున "తత్, త్వం, అసి" అను మూడు పదములున్నవి. ఈ మూడును తత్త్రిపదములు. ఈ మహావాక్యము గురుగుహ ఉపదేశితము. ఈ మహావాక్యము ఆత్మబ్రహ్మైక్యతాలక్ష్యమును బోధించునని శాస్త్రసిద్ధము.

అనంగకుసుమాద్యష్టశక్త్యాకారయా : శ్రీ చక్రమున మూడవ ఆవరణయగు అష్టదళపద్మమునందు అనంగకుసుమాది అష్టశక్తులున్నవి. ఈ దేవతల నామములు పైన చెప్పబడినవి. శ్రీదేవి ఈ అష్టశక్తుల స్వరూపిణియని భావము. ఈ అష్టశక్తులపేర్లలో ముందు "అనంగ" అను పదమున్నది. అనంగపదమునకు అనం

గునితో కూడిన శరీరులని భావము. స్థూలసూక్ష్మ శరీరములు రెండును లేనివారని భావము.

అష్టవర్గాత్మకగుప్తతరయా : పంచాశద్వర్ణములు అష్టవర్గములుగా విభజింపబడియున్నవి. అ, క, చ, ట, త, ప, య, శ అనుఅక్షరములు వర్గాది అక్షరములు. శ్రీదేవి మాతృకావర్ణరూపిణి. ఆమె గుప్తతరయోగినీ దేవతలైన మూడవ ఆవరణ దేవతాకృతి పూనియున్నది. అందుచేత నామె అష్టవర్గాత్మక గుప్తతర అగుచున్నది.

అనంగాద్యుపాసితయా : పరదేవతయగు శ్రీదేవిని ఉపాసించిన శ్రీవిద్యాచక్రవర్తులలో అనంగుడైన మన్మథుడొకడు. మను, చంద్ర, కుబేర, లోపాముద్రా, మన్మథ, అగస్త్య, అగ్ని, సూర్య, ఇంద్ర, షణ్ముఖ, ఈశ్వరదూర్వాసోఋషులు పన్నెండు మంది శ్రీవిద్యాచక్రవర్తులు "మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః అగస్తిరగ్ని సూర్యశ్చ ఇంద్రస్కందశ్శివస్తథా క్రోధభట్టారకో దేవ్యా ద్వాదశామీ ఉపాసకాః "అని ప్రమాణ శ్లోకము.

రహస్యార్థ తత్త్వవిమర్శనము : ఈ ఆవరణమునందు సంప్రదాయపరదేవతయొక్క అవ్యక్త మహత్తత్త్వాహంకారములు భూత తన్మాత్ర పంచకము దేవతాస్వరూపములను దర్శించినవని సంప్రదాయము.

ఈ మూడవఆవరణ దేవతలైన అనంగకుసుమాది అష్టశక్తులు కర్మేంద్రియ ధర్మములైన (వచన, దాన, గమన, విసర్గ, సంభోగాది సుఖము) ప్రవృత్తి, నివృత్తి, ఉపేక్ష అనునవి

మూడును కలసి దేవతా రూపములు ధరించినవి.

మూడవ ఆవరణము సుషుప్తి అవస్థాభూమిక. సుషుప్తి జీవత్రితయము. సుషుప్తి అవస్థయందు లౌకికజ్ఞానముండదు. ప్రమాతమాత్రముండును. సుషుప్తి అవస్థలోని జీవునికిసుఖాకార అనుభవమున్నదనుట స్పష్టము. 'నేను సుఖముగ నిద్రించితిని' అని చెప్పుకొనుచున్నాము. ఈ అనుభవప్రదాత చిచ్ఛక్తియే. ఆమె తృతీయావరణ అధిష్ఠాత్రి.

మూడవ ఆవరణదేవత త్రిపురసుందరి యను పేరుకలది. మూడువశలును మూడుపురములు. జాగ్రత్ స్వప్న సుషుప్తులు. ఈ అవస్థాత్రియమునకు అధిష్ఠాత్రి.

నాలుగవ ఆవరణ కీర్తన

రాగము : కాంభోజ తాళము : ఆట

పల్లవి

కమలాంబికాయై కనకాంశుకాయై
కర్పూరవీటికాయై నమస్తే నమస్తే

అను పల్లవి :

కమలాకాంతానుజాయై కామేశ్వర్యై అజాయై
హిమగిరితనూజాయై హ్రీంకారపూజ్యాయై
కమలానగరవిహారిణ్యై ఖలసమూహసంహారిణ్యై
కమనీయరత్నహారిణ్యై కలికల్మషపరిహారిణ్యై ॥కమలా

చరణం

సకలసౌభాగ్యదాయకాంభోజచరణాయై
సంక్షోభిణ్యాది శక్తియుతచతుర్థావరణాయై

ప్రకటచతుర్దశ భువనభరణాయై
ప్రబల గురుగుహ సంప్రదాయాంతఃకరణాయై
అకలంకరూపవర్ణాయై అపర్ణాయై
సుపర్ణాయై సుకరధృతచాపబాణాయై
శోభనకరమనుకోణాయై సకుంకుమాదిలేపనాయై
చరాచరాదికల్పనాయై చికురవిజితనీలఘనాయై
చిదానందపూర్ణఘనాయై ॥కమలాంబికాయై॥

తాత్పర్యము

కమలాంబికకై, బంగారు అంశుకముధరించిన శ్రీదేవికై, కర్పూరతాంబూలముఖయైన శ్రీదేవికై, లక్ష్మీదేవియొక్క భర్తయగు నారాయణుని సహోదరియగు శ్రీదేవికై, కామేశ్వరికై, అజకై, హిమగిరితనుజకై, హ్రీంకారపూజ్యకై, కమలానగర విహారిణికై, దుష్టజనసంహారిణికై, కమనీయమైన రత్నహారములను ధరించిన శ్రీదేవికై, కలికల్మషపరిహారిణికై, సకల సౌభాగ్యములనిచ్చు పాదపద్మములుకల శ్రీదేవికై, సంక్షోభిణీమొదలైన శక్తులతోకూడిన నాలుగవ ఆవరణము కలిగిన శ్రీదేవికై, ప్రకాశించుచున్న చతుర్దశభువనములను భరించు శ్రీదేవికై, ప్రబలమైన గురుగుహ సంప్రదాయాంతఃకరణముకలిగిన శ్రీదేవికై, అకలంకమైన రూపవర్ణములుకలిగిన శ్రీదేవికై, అపర్ణయగు శ్రీదేవికై, సుపర్ణయగు శ్రీదేవికై, చేతులందు బాణచాపములను ధరించిన శ్రీదేవికై, శోభనకరమగు చతుర్దశాచక్రముగల శ్రీదేవికై, కుంకుమాదిలేపనము కల శ్రీదేవికై, చరాచరములను కల్పించిన శ్రీదేవికై,

నీలమేఘములను జయించిన చికురముకలిగిన శ్రీదేవికై, చిదానందపూర్ణఘనయగు శ్రీదేవికై నమస్కారము.




ఈ కీర్తన చతుర్థీవిభక్తియందున్నది. (జే). ఇది నాలుగవ ఆవరణ కీర్తన. నాలుగవఆవరణకు సర్వసౌభాగ్యదాయక చక్రమని పేరు. దీనిని చతుర్దశారమందురు. ఈకారము దీని ప్రకృతి. ఇది చతుర్దశ భువనాత్మకమైనది దాడిమీకుసుమసహోదర వర్ణము. ఈ చతుర్దశారమున (పదునాలుగుకోణములు) ఒక్కొక్క కోణమునందొక్కొక్క దేవత కలదు. మొత్తముపదునాలుగుమంది దేవతలు. వారుసర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వసమ్మోహిని, సర్వస్తంభిని, సర్వజృంభిణి, సర్వవశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సర్వార్థసాధిని, సర్వసంపత్తిపూరణి, సర్వమంత్రమయీ, సర్వద్వంద్వక్షయంకరీ అనువారలు. ఈ దేవతలకు సంప్రదాయయోగినులని పేరు. ఈ చక్రేశ్వరి త్రిపురవాసిని. రసము భయానకము.

సంవిద్రూప పరదేవత యొక్క ఇంద్రియదశకము అంతఃకరణచతుష్టయమును ఇచ్చట దేవతాస్వరూపములు ధరించినవి.

విశేషాంశములు : ఈ కీర్తనలో సగుణసాకార, సగుణనిరాకార, నిర్గుణ, శ్రీ చక్రసంబంధ నామములున్నవి.

సగుణసాకారనామములు: కనకాంశుకాయై, కర్పూరవీటికాయై,

హిమగిరితనూజాయై, కమలానగర విహారిణ్యై, కమనీయరత్న హారిణ్యై, అపర్ణాయై, సుపర్ణాయై, సుకరధృతచాపబాణాయై, సకుంకుమవిలేపనాయై, చికురవిజితనీలఘనాయై.

సగుణనిరాకారనామములు : కామేశ్వర్యై, ఖలసమూహ సంహారిణ్యై, కలికల్మష పరిహారిణ్యై, అకలంకరూపవర్ణాయై, చరాచరాదికల్పనాయై, ప్రకటచతుర్దశభువన భరణాయై.

నిర్గుణనామములు : అజాయై, ప్రబలగురుగుహ సంప్రదాయాంతఃకరణాయై, చిదానందపూర్ణఘనాయై.

శ్రీచక్రసంబంధనామములు : హ్రీంకారపూజ్యాయై, సకల సౌభాగ్యదాయక అంభోజచరణాయై, సంక్షోభిణ్యాదిశక్తియుత చతుర్థావరణాయై, శోభనకరమనుకోణాయై.

రహస్యతత్త్వవిమర్శ :

కమలాకాంతానుజాయై : లక్ష్మీదేవికి పతియగు విష్ణుమూర్తికి సహోదరి. దేవీభాగవతమున తొమ్మిదవ స్కంధమున సృష్టి క్రమముయొక్క వర్ణనమున్నది. శివశక్తిసామరస్య ఆనందామృతమయ కారణజలమున మూడుఅండములు ప్రభవించినవి. అవి త్రిగుణాత్మకములు. మాయాకల్పితములు.

సత్త్వగుణ అండమున విష్ణువు, గౌరి అవతరించిరి. అందుచేత వీరిద్దరు సహోదరులు. రజోగుణ అండమున బ్రహ్మ, లక్ష్మియు అవతరించిరి. తమోగుణఅండమున రుద్రసరస్వతులు అవతరించిరి.

చిచ్ఛక్తి పరదేవతాస్వరూపిణియగు లక్ష్మి విష్ణువును, సరస్వతి బ్రహ్మను, గౌరి రుద్రునిపొంది సృష్టిస్థితిలయ కార్య

నిర్వాహణమునకు ఆజ్ఞాపనము జరిగినది. కమలాంబిక గౌరియై మహావిష్ణువునకు సహోదరియైనదని ప్రతిపాదింపబడినది.

హిమగిరితనూజాయై : దక్షుని యజ్ఞమును చూచుటకు వెళ్ళి సతీదేవి తన తేజోఽగ్నిలో శరీరమును దగ్ధము చేసికొనెను. శివుని జటనుండి ఆవిర్భవించిన వీరభద్రుడు దక్షయజ్ఞమును ధ్వంసము చేసెను. పిమ్మట దేవతలచే ప్రార్థింపబడి తారకాసుర సంహారనిమిత్తము కుమారస్వామి అవతరింపవలసి శ్రీదేవి హిమవంతుని కుమార్తెగా అవతరించెను.

సకలసౌభాగ్యదాయక అంభోజచరణాయై : తన చరణపద్మములను ఆశ్రయించిన భక్తులకు సకల సౌభాగ్యములను ప్రసాదించునట్టిది. అనగా శ్రీదేవి తన చరణములను ఆశ్రయించిన వారికి మోక్షముకూడ నీయగలదని భావము. ఇక సామాన్య సుఖములనుగురించి చెప్పనక్కరలేదు. ఈ విషయము శ్రీశంకర భగవత్పూజ్యపాదులు సౌందర్యలహరియందు విశదముగా చెప్పిరి

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవహి చరణావేవ నిపుణౌ"

ఉపాసకులకు అభీష్టసిద్ధినిచ్చుట పరదేవతయొక్క చరణముల లక్షణము.

ఈ పదములకు మరియొక శ్లేషార్థమున్నది. సకలసౌభాగ్యదాయక చక్రమునందు చరణములనుంచినదని. ఈ

ఆవరణచక్రమునకు సకలసౌభాగ్యదాయక చక్రము

హ్రీంకారపూజ్యాయై : శ్రీదేవియొక్క త్రిశతీనామములం దొకటి (95వ నామము) హ్రీంకారము. ఏకాక్షరభువనేశ్వరీ మంత్రము. హ్రీంకార భువనేశ్వరీ మంత్రముచే పూజింపబడు నది యని తాత్పర్యము. కమలాంబికయే ఏకాక్షరమంత్ర అధిష్ఠానదేవతయగు భువనేశ్వరి యని భావము.

సంక్షోభిణ్యాదిశక్తియుత చతుర్థావరణాయై : సంక్షోభిణిమొదలగు శక్తులచే కూడియుండిన చతుర్థావరణము కలది. ఈ ఆవరణములో సంక్షోభిణి మొదలుగా 14రు శక్తులున్నారు. వీరికి సంప్రదాయ యోగినులని పేరు. సంప్రదాయమనగా గురుపరంగా అనుష్ఠింపబడు ఆచారము. ఈ పదునాలుగు శక్తుల వివరములు పైన తెలుపబడినవి.

ప్రకటచతుర్దశ భువనభరణాయై : భువనములు చతుర్దశములని ప్రసిద్ధి. ఈ పదునాలుగు భువనములను యీ ఆవరణయందున్న 14 శక్తి దేవతలచేత పాలించుచున్నదని తాత్పర్యము. ప్రకట యనగా అందరకు అనుభవమునకు వచ్చునట్టిదని (అందరకు తెలియుచున్నదని) భావము (ప్రకటాసర్వైరనుభూయమానా)

ప్రబల గురుగుహ సంప్రదాయాంతఃకరణాయై : ప్రబలమనగా మిక్కిలి బలముకలిగినదని, అనగా శాస్త్రసమ్మతమైనదని, పూర్వపక్షము చేయుటకు వీలుకానట్టిదని యర్థము.

ప్రబలమగు సద్గురువగు గుహునిచే ఆజ్ఞాపింపబడిన ఆచారముయొక్క పరమతాత్పర్యముచే ప్రకాశింపబడుచున్న

పరదేవతయని తాత్పర్యము.

చిదానందపూర్ణఘనాయై : చిత్తు అను ఆనందపరిపూర్ణత్వముచే ఘనత్వము కలది అనృతాది దుఃఖములులేని జ్ఞానానంద పరిపూర్ణ స్వరూపిణియని భావము. ఆనందము, విషయానుభవము, నిత్యత్వము అను ధర్మములు చైతన్యముకంటె వేఱు గావు. వేఱుగానున్నట్లు కన్పించును ఈ విషయము శ్రీ శంకర భగవత్పాదుల శిష్యులగు పద్మపాదాచార్యులవారు రచించిన పంచపాదికయందు చెప్పబడినది. "ఆనందో విషయానుభవో నిత్యంచేతి సంతి ధర్మా అపృథక్త్వేపి చైతన్యాత్ పృథగివావభాసంత"

రహస్యతత్వము : ఈ ఆవరణచక్రము ఈశ్వర విచారము చేయునట్టి మనస్సునకు సంబంధించినది. ఈ విధమైన మనస్సు యొక్క వృద్ధిని సూచించు దేవతలే ఆవరణదేవతలు. సంప్రదాయమూలము పరమేశ్వరుడే. ఆదిగురువు శ్రీ దక్షిణామూర్తి. అయిదవ ఆవరణ కీర్తన.

భైరవి : రాగము ఝంపె : తాళము

పల్లవి

శ్రీ కమలాంబికాయాః పరం నహిరే రేచిత్త
క్షిత్యాది శివాంతతత్వస్వరూపిణ్యాః ॥శ్రీ కమలా

అను పల్లవి

శ్రీకంఠవిష్ణువిరించాది జనయిత్ర్యాః
శివాత్మక విశ్వకర్త్ర్యాః కారయిత్ర్యాః

శ్రీకరబహిర్దశార చక్రస్థిత్యా -
స్సేవితభైరవీ భార్గవీభారత్యాః ॥శ్రీకమలా

చరణము

నాదమయసూక్ష్మరూప సర్వసిద్ధిప్రదాది దశ
శక్త్యారాధితమూర్తేః శ్రోత్రాదిదశకరణాత్మక
కుళకౌళికాది బహువిధోపాసితకీర్తేః
అభేదనిత్యశుద్ధబుద్ధముక్త సచ్చిదానంద
పరమాద్వైతస్ఫూర్తేః ఆదిమధ్యాంతరహితాప్రమేయ
గురుగుహ మోదిత సర్వార్థసాధకపూర్తేః
మూలాది నవాధారవ్యావృత్త దశధ్వనిభేదజ్ఞ
యోగిబృందసురక్షణ్యాః అనాదిమాయావిద్యా
కార్యకారణ వినోదకరణ పటుతరకటాక్ష వీక్షణ్యాః
॥శ్రీకమలా

దీని తాత్పర్యము :

ఓ మానసమా ! శివుని మొదలు పృథివివరకుగల ముప్పదియారు తత్త్వముల స్వరూపిణియగు శ్రీదేవికంటె, శివ విష్ణుబ్రహ్మలకు తల్లియైన శ్రీదేవికంటె, శివాత్మకమైన విశ్వమును సృష్టించిన శ్రీదేవికంటె, కారయిత్రికంటె, శ్రీకర మైన అయిదవ ఆవరణమగు బహిర్దశార చక్రమునందు వేంచేసి యున్న శ్రీదేవికంటె, భైరవీ, భార్గవీ, భారతులచేత సేవింప బడుచున్న శ్రీదేవికంటె, నాదమయమైన సూక్ష్మరూపములను ధరించియున్న సర్వసిద్ధిప్రదా మొదలగు పదిశక్తులచేత ఆరా ధింపబడినమూర్తియగు శ్రీదేవికంటె, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ

ధర్మములు ధరించిన యోగినీమూర్తులచేత బహువిధములుగా ఉపాసింపబడిన కీర్తిగల శ్రీదేవికంటె, అభేదనిత్యశుద్ధబుద్ధముక్త సచ్చిదానంద పరమాద్వైతస్ఫూర్తియగు శ్రీదేవికంటె, ఆది మధ్యాంతరహిత అప్రమేయమై సద్గురువగుగుహునిచే ఆమోదింపబడిన సర్వార్థసాధకపూర్తియగు శ్రీదేవికంటె, మూలాధారాదినవాధారములందు వినిపించు పదివిధములైన ధ్వనులను భేదించు యోగిబృందమును సంరక్షించు శ్రీదేవికంటె, అనాది యగుమాయా అవిద్యా కార్యకారణవినోదములను హరింపజాలుకటాక్షవీక్షణములను ప్రసాదించు శ్రీదేవికంటె, పరమైనది మరియొకటిలేదు.

ఇది అయిదవ ఆవరణ కీర్తన. ఇది పంచమీవిభక్తియందున్నది. (జసి) అయిదవ ఆవరణమునకు బహిర్దశారమని పేరు. ఇది దశకోణాకృతి కలది. ఇది సర్వార్థకచక్రము ఏకారప్రకృతి కలది. దశావతారాత్మకమైనది. ఇచట పదిమంది దేవతలున్నారు. వారు సర్వసిద్ధిప్రదా, సర్వసంపత్ప్రదా, సర్వప్రియంకరీ, సర్వమంగళకరి, సర్వకామప్రదా, సర్వదుఃఖవిమోచని, సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్ననివారిణి, సర్వాంగసుందరి, సర్వసౌభాగ్యదాయిని అనువారలు. ఈ దేవతలు కులోత్తీర్ణయోగినులు. ఈ చక్రమునకు అధిష్ఠాత్రి త్రిపురా. ఈ చక్రమున బీభత్సరసము.

సంవిద్రూప పరదేవతయొక్క జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియపంచకము కలిసిపదియు సర్వసిద్ధిప్రదాది దేవతలై

నిర్మలమైన నేపథ్యాలంకారములతో యీ చక్రమున భాసించు చున్నారు.

విశేషములు - ఈ కీర్తనలో శ్రీదేవియొక్క నామములున్నవి. అవి సగుణసాకార, సగుణనిరాకార, నిర్గుణములుగను, శ్రీచక్రమునకు సంబంధించినవిగను కలవు.

సగుణసాకార నామములు : శ్రీకంఠవిష్ణువిరించాదిజనయిత్రి; సేవితభైరవీ భార్గవీ భారతీ.

సగుణనిరాకారనామములు : క్షిత్యాది శివాంతతత్త్వస్వరూపిణి, శివాత్మకవిశ్వకర్త్రి, కారయిత్రి, మూలాదినవాధారవ్యావృత్త దశధ్వనిభేదజ్ఞ యోగినీబృంద సంరక్షణి అనాది మాయావిద్యా కార్యకారణ వినోదహరణ పదుత్తర కటాక్షవీక్షణి.

నిర్గుణనామములు : అభేదనిత్యశుద్ధబుద్ధముక్త సచ్చిదానంద పరమాద్వైతస్ఫూర్తి; ఆదిమధ్యాంతాప్రమేయ గురుగుహమోదిత సర్వార్థసాధకపూర్తి

శ్రీచక్రసంబంధమైననామములు : శ్రీకరబహిర్దశారచక్రస్థితా, నాదమయ సూక్ష్మరూప సర్వసిద్ధిప్రదాది దశశక్త్యారాధితమూర్తిః, శ్రోత్రాది దశకరణాత్మక కుళకౌళికాది బహువిధోపాసితకీర్తిః.

విశేష విమర్శ :

శ్రీకరబహిర్దశారచక్రస్థిత : శ్రీ చక్రమున అయిదవ ఆవరణకు బహిర్దశారమని పేరు. దశారమనగా పది కోణములున్నదని. బహిర్దశారమనగా వెలుపలగానున్న పదికోణముల చక్రము.

లోపలగానుండి పదికోణములున్న చక్రము మరియొకటి కలదు దానికి అంతర్దశారమని పేరు. ఈ చక్రమునకు సర్వార్థసాధక చక్రమని పేరు. ఈ చక్రమునందున్న దేవతలు సకలార్థముల నీయగలరు. అందుచేత ఆ పేరు. ఆ దేవతలకు నాయకి శ్రీ కమలాంబిక యని అభిప్రాయము.

సేవితభైరవి భార్గవి భారతీ : రుద్రాణి, విష్ణుపత్ని, భారతీదేవులచే సేవింపబడినది. ఈ ముగ్గురు త్రిమూర్తులయొక్క శక్తులు. సృష్ట్యాదికార్యములను చేయుటకు కావలసిన సామర్థ్యము పరదేవతయొక్క కృపచేతనే వారికి లభించినది. వారు శ్రీదేవిని ధ్యానముచేయుచు తమకృత్యములను చేయుదురు. అందుచేత వారి భార్యలును శ్రీదేవిని సేవించుచున్నారని భావము.

ఈ భావమును శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు సౌందర్యలహరిలో చెప్పిరి.

"శివఃశక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్
నచేదేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుంస్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి॥

నాదమయసూక్ష్మరూప సర్వసిద్ధిప్రదాది దశశక్త్యారాధితమూర్తేః – నాదమయములైన సూక్ష్మరూపములుగల సర్వసిద్ధిప్రద మొదలగు పదిశక్తులచేత ఆరాధింపబడిన మూర్తి. ఈ ఆవరణలో సర్వసిద్ధిప్రద మొదలగుపదిశక్తులు ఆవరణదేవతలుగానున్నవి. వాటి పేర్లుపైన చెప్పబడినవి. ఆ శక్తులు పరదేవతను ఆరాధించుచున్నవి. ఈశక్తులు సూక్ష్మమయనాదస్వరూపము

కలవి. నాదములు పదివిధములు దశవిధనామములు యోగులకు తెలియును. ఈ పదినాదములు, 1. చిణి 2. చిణిచిణి 3. ఘంటా నాద 4. శంఖనాద 5. వీణానాద 6. తాళశబ్ద 7. వేణువాద 8. భేరీనాద 9 మృదంగనాద 10 మేఘనాదములు.

భ్రూమధ్యమునుండి సహస్రారమధ్యము వరకు గల తొమ్మిది సూక్ష్మచక్రములందు సంచారము చేయునపుడు ఆరోహణక్రమమున దహరాకాశమున దశవిధమండలములు (వియన్మండల, తమోమండల మేఘమండల, విద్యున్మండల, తారామండల, జ్యోతిర్మండల, సూర్యమండల, చంద్రమండల, వహ్నిమండల, హిరణ్మయమండలములు)కన్పించును. ఆదశవిధ మండలములందీ దశవిధ నాదములు. ఈ దశవిధమండలముల తరువాతనే శివశక్తియుక్తమైన జీవతత్త్వము. అచ్చటనే ఉన్మని అర్థమాత్రక తురీయము విరజ అను నామాంతరముగల శుద్ధ తత్త్వము.

యోగులు యీ దశవిధనాదములు పరానాదమున లయింపజేయుదురు. ఆ స్థితిలో మనఃప్రాణములు నాదబిందు కళలలో లయించుచున్నమాట, ఆయవస్థనుతురీయమని, ఉన్మని యని, సహజామనస్కమని చెప్పుదురు. ఉన్మన్యవస్థలో అంతః కరణ ప్రాణములును వివిధవిషయములుగల యింద్రియములును (జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ) నశించును. ఈ దశవిధనాదములను భేదించుకొని ప్రయోగమించుట తెలిసిన యోగిజనములను పర దేవత అనుగ్రహించునని భావముతో "మూలాదినవాధార వ్యావృత్తి భేరజ్ఞ యోగిబృంద సురక్షణి" అని చెప్పబడినది.

శ్రోత్రాదిదశకరణాత్మక కులకౌళికాది బహువిధోపాసితకీర్తేః
-బహిర్దశారమని చెప్పబడు యీ అయిదవ ఆవరణమునందు
కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు పదియు సర్వసిద్ధిప్రదాది
దేవతలై యున్నారని తెలిపితిని. వారు కులోత్తీర్ణ యోగినులు.
ఈ కులోత్తీర్ణ (కులకౌళికాది) యోగినీస్వరూపముల ధరించిన
దశేంద్రియములచే బహువిధములుగా ఉపాసింపబడుచున్నది
పరదేవత.

ప్రాణములైదును (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన,
సమాన) ఉపప్రాణములైదును (నాగ, కూర్మ, కృకర, దేవ
దత్త, ధనంజయ) కలసి (పదివాయువులు) యీ ఆవరణదేవ
తలుగానున్నవని భావనోపనిషత్తు తెలుపుచున్నది.
అభేదనిత్యశుద్ధబుద్ధముక్తసచ్చిదానంద పరమాద్వైతస్ఫూర్తి-
భేదములేని, నాశములేని, (శుద్ధ) అజ్ఞానములేని (బుద్ధ) జ్ఞాన
స్వరూపమగు బంధరహిత (ముక్త) సచ్చిదానందపరమాద్వైత
స్ఫూర్తి.

ఆదిమధ్యాంతరహిత అప్రమేయ గురుగుహ మోదిత సర్వార్థ
సాధకపూర్తేః : ఆదిమధ్యాంతములులేక అప్రమేయమై
సద్గురువగు గుహునికి సంతోషము కలిగించునట్టి సకల పురు
షార్థపరిపూర్ణస్వరూపిణి. సకల పురుషార్థపరిపూర్ణస్వరూపిణి
అనుటకుబదులు సర్వార్థసాధకచక్రమున ఆవరణదేవతా
మూర్తులుగా వ్యాపించియున్న పరదేవతయనికూడ భావింప
వచ్చును.

అనాదిమాయా విద్యాకార్యకారణ వినోదహరణపటుత్తర కటాక్షవీక్షణ్యాః : అనాదియగు మాయ, అవిద్యల కార్య కారణలీలను నాశనముచేయు సామర్థ్యముగల కటాక్ష వీక్షణము కలది.

క్షిత్యాదిశివాంతతత్త్వస్వరూపిణి భూమిమొదలు శివపర్యంతమున్న 36 తత్త్వముల స్వరూపిణియగు పరదేవతకంటె పైన మరొకటిలేదు.

ఆరవ ఆవరణ కీర్తన

పున్నాగవరాళి : రాగము రూపక తాళము (తిశ్ర-ఏక)

పల్లవి

కమలాంబికాయా స్తవభక్తోఽహం
శంకర్యాః శ్రీకర్యాః సంగీతరసికాయాః

అను పల్లవి

సుమశరేక్షు కోదండపాశాంకుశపాణ్యాః
అతిమధురతరవాణ్యాః శర్వాణ్యాః కల్యాణ్యాః
రమణీయపున్నాగవరాళి విజితవేణ్యాః ॥కమలాంబికా

చరణం :

దశకలాత్మక వహ్నిస్వరూప ప్రకాశాంత
ర్దశారసర్వరక్షాకర చక్రేశ్వర్యాః
త్రిదశాదినుత కచవర్గద్వయ సర్వజ్ఞాది
దశశక్తిసమేత మాలినీచక్రేశ్వర్యాః
త్రిదశవింశద్వర్ణ గర్భిణీకుండలిన్యాః
దశముద్రాసమారాధిత కౌళిన్యాః

దశరథాదినుత గురుగుహజనక శివబోధిన్యాః
దశకరణావృత్తి మరీచిని గర్భయోగిన్యాః ॥కమలాంబికా

దీని తాత్పర్యము :




శంకరియైనటువంటి, శ్రీకరియైనటువంటి, సంగీతరసికయైనటువంటి, పూలబాణములను చెఱకు కోదండమును పాశాంకుశములను చేతులందు ధరించినటువంటి, అతి మధురమైనవచస్సు కలిగినటువంటి, శర్వాని భార్యయగునట్టి, కల్యాణియగునట్టి, పున్నాగవరాళి (తుమ్మెదలసమూహాము)ని జయించిన రమణీయమైన వేణి కలిగినటువంటి, దశకలాత్మకమై వహ్నిస్వరూప ప్రకాశమైయున్న అంతర్దశారనామక సర్వరక్షాకర చక్రేశ్వరియైనటువంటి. దేవతలచేత వినుతింపబడిన కచవర్గద్వయరూప దశశక్తిసమేత మాలినీచక్రేశ్వరియగునట్టి, పంచాశద్వర్ణగర్భిణీకుండలినియగునట్టి, దశముద్రాదేవతలచేత రాధింపబడిన కాళినీయగునట్టి, దశరథాదులచే వినుతింపబడి సద్గురువగుగుహునితండ్రియగు శివునియొక్క తత్త్వమును బోధించునట్టి, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములవృత్తిమరీచులగు గర్భయోగినులను దేవతాస్వరూపిణియగునట్టి కమలాంబికయొక్క భక్తుడను నేను.

ఈ కీర్తన షష్ఠీవిభక్తి (ఙస్) యందున్నది. ఇది ఆరవ ఆవరణ కీర్తన. శ్రీచక్రమున ఆరవచక్ర వివరములిట్లున్నవి.

ఈ ఆవరణకు అంతర్దశారమని పేరు. ఇది సర్వరక్షాకర నామముకలది. దీనిప్రకృతిరేఫ. దీనితత్త్వము అగ్ని. ప్రకృతి రేఫ. ఇది జపాకుసుమవర్ణకలితము. ఇచట పదిమంది దేవత లున్నారు వారు సర్వజ్ఞా, సర్వశక్తి, సర్వైశ్వర్య ప్రదాయినీ, సర్వజ్ఞానమయీ, సర్వవ్యాధివినాశినీ, సర్వాధారస్వరూపిణీ, సర్వపాపహరీ, సర్వానందమయీ, సర్వరక్షాస్వరూపిణి, సర్వేప్సితఫలప్రదా అనువారు. ఈ దేవతలు గర్భయోగినులు. అనగావీరు దేవతాగర్భములు. చక్రేశ్వరి త్రిపురమాలిని. రసము శాద్రము. పరదేవతయొక్క జ్ఞానకర్మేంద్రియ విషయ వృత్తులే యిచట సర్వజ్ఞాది శక్తిరూపములైనవి.

ఈ కీర్తనలో శ్రీదేవియొక్క సగుణసాకార, సగుణ నిరాకార, శ్రీచక్రసంబంధ నామములున్నవి

సగుణసాకార నామములు : సంగీతరసిక, సుమశరేక్షుకోదండ పాశాంకుశపాణి, అతిమధురవాణి, శర్వాణి, కల్యాణి, రమ ణీయపున్నాగవరాళి విజితవేణి.

సగుణనిరాకార నామములు : గురుగుహాజనక శివబోధిని.

శ్రీచక్రసంబంధమైనవి : అంతర్దశార సర్వరక్షాకర చక్రేశ్వరి. కచవర్గద్వయ సర్వాంగాది దశశక్తిసమేతమాలినీ చక్రేశ్వరి. త్రిదశ వింశతివర్ణగర్భిణీ మండలినీ, దశముద్రా సమారాధిత కౌళినీ, దశకరణవృత్తిమరీచిని గర్భయోగినీ,

విశేషములు :

శంకరి - సుఖకరుడైన శంకరునిభార్యగాన శ్రీదేవి శంకరి యగుచున్నది. కరః అనగా చేయునదియని యర్థము. సుఖము

చేయువాడుగాన శంకరుడు. కాళికాపురాణమందు "శ్లో॥ ప్రతి సర్గాదిమధ్యాంతమహం శంభుం నిరాకులం స్త్రీరూపేణాను యాస్యామి ప్రావ్యదక్షాదహం తనుం తతస్తువిష్ణుమాయాంమాం యోగనిద్రాం జగన్మయీం, శాంకరీతిస్తువిష్యంతి రుద్రాణీతి దివౌకసః" (ప్రతి సృష్టి, స్థితి, లయములందు నిరాకులుడైన శంభువును నేను స్త్రీ రూపముచే దక్షునిపుత్రికనై అనుసరింతును. అప్పుడు దేవతలు నన్ను విష్ణుమాయ, జగన్మయి, శాంకరి, రుద్రాణి అని కీర్తింతురు) అని కలదు. ఇహపర సౌఖ్యప్రదాయిని శంకరి.

శ్రీకరీ : శ్రియఃకరీ - శ్రీకరీ. శ్రేయో (మోక్ష) దాయిని. ఇది లలితాసహస్రనామావళియందు 127వ నామము. లక్ష్ములను (మోక్షలక్ష్మీసహా) చేయునది శ్రీకరి. విష్ణువునకు "శ్రీధరః శ్రీకరః శ్రీమాన్" అని నామములు (విష్ణుసహస్ర నామపాఠము) కలవు. శ్రీదేవి విష్ణుసంబంధి. అందుచేత నీ నామములు వర్తించును.

సుమశరేక్షు కోదండపాశాంకుశపాణి : శ్రీదేవి పంచపుష్ప బాణములను, చెఱకువిల్లును, పాశమును, అంకుశమును, ధరించినదని భావము.

శ్రీదేవి ధ్యానశ్లోకములలో ప్రసిద్ధమైన శ్లోకమొకటి. దానియందీ వివరణముకలదు.

"సకుంకుమవిలేపనాం అళికచుంబికస్తూరికాం
సమందహసితేక్షణాం సశరచాపపాశాంకుశాం

అశేషజన మోహినీం అరుణమాల్యభూషోజ్జ్వలామ్
జపాకుసుమభాసురాం జపవిధౌస్మరేదంబికామ్" ॥

మరియు శ్రీదేవికి లలితాసహస్ర నామములందీనామములు కలవు. మనోరూపేక్షుకోదండా, పంచతన్మాత్రసాయకా, రాగస్వరూపపాశాఢ్యా, క్రోధాకారాంకుశోజ్జ్వలా,(8, 9, 10, 11 నామములు)

శ్రీదేవియొక్క పంచపుష్ప బాణములు- కమలము, తెల్లకలువ, నల్లకలువ, ఎఱ్ఱకలువ, మామిడిపూవు (కమలం, కైరవం రక్తం కల్హారేందీవరే తథా సహకారక మిత్యుక్తం పుష్పపంచకమీశ్వరీ).

శ్రీదేవియొక్క ఇక్షుకోదండము మనోరూపమైనది. పంచపుష్పబాణములును పంచతన్మాత్రలు. రాగస్వరూపమైనది పాశము. అంకుశము క్రోధాకారము.

పంచతన్మాత్రలు శబ్దస్పర్శరూపరసగంధములను అయిదు పంఖ్యలకు విషయములైనవి. ఇవి పంచభూతముల సూక్ష్మరూపములు. ఈ పంచతన్మాత్రలు పుష్పబాణములై మదన, ఉన్మాదన, మోహన, దీపన, శోషణ కృత్యములను కలిగించుచున్నవి

ఇక్షుకోదండము సంకల్పవికల్పాత్మకమై క్రియారూపమైన మనస్సు. ఇది శ్రీదేవి వామఊర్ధ్వహస్తమున కలదు.

రాగమనగా ప్రేమ, అనురాగము, మనోవ్యాపార విశేషము, కోరిక, ఆశ, రాగమే తనయొక్క వాసనామయమైన రూపమగు పాశముగా నున్నది. క్రోధమనగా ద్వేషమను

పేరుగల చిత్తవృత్తి. ఇది శ్రీదేవికి అంకుశరూపమైన ఆయుధ ముగా నున్నది.

తంత్రరాజమను గ్రంథమున వాసనాపటలమున "మనస్సు చెఱకు విల్లు, ఇచ్ఛ (కోరిక)యే పాశము, ద్వేషమే అంకుశము, పంచతన్మాత్రలు పుష్పబాణములు" అని చెప్పబడినది. (మనోభవేదిక్షు ధనుః పాశో రాగ ఉదీరితః ద్వేషః స్యాదంకుశః పంచతన్మాత్రాః పుష్పసాయకా)

దశకలాత్మక వహ్నిస్వరూప ప్రకాశ అంతర్దశారసర్వరక్షాకర చక్రేశ్వరి ఆరవ ఆవరణము అంతర్దశారము. దీని తత్త్వము అగ్ని. అగ్నికి పది కళలు, ఈ ఆవరణదేవతలు పదిమంది. వారి నామములు పైన చెప్పబడినవి. అగ్నియొక్క పదికళలును యీ పది ఆవరణదేవతలుగా ప్రకాశించుచున్నవని భావము. (అగ్ని యొక్క పదికళలు-ధూమ్రా, ఊష్మా, జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగినీ, సుశ్రీ, సురూపా, కపిలా, హవ్యవాహినీ, కవ్యవాహినీ). ఈ అంతర్దశార చక్రమునకు సర్వరక్షాకరచక్రమని పేరు. ఈ చక్రేశ్వరి త్రిపురమాలిని.

త్రిదశాదినుత కచవర్గద్వయ సర్వజ్ఞాది దశశక్తిసమేత మాలినీ చక్రేశ్వరి : ఈ ఆరవఆవరణ అధిష్ఠానదేవత త్రిపుర మాలిని. ఆమె సర్వజ్ఞాది (పైనచెప్పిన) దశశక్తులతో కూడినది, వారు క,చ, అను రెండు వర్గాక్షర (కఖగఘఙ చఛజఝఞ) ములస్వరూపిణిలు. ఈ దేవత దేవతల చేత వినుతింపబడినవారు.

త్రిదశవింశద్వర్ణ గర్భిణీకుండలినీ : ఆంతరచక్రములైన మూలాధారాది సహస్రాంతమున వర్ణమాల యొక్క పంచాశత్తు

(30 + 20=50) వర్ణము లున్నవి. ఈ ఆంతరచక్రగర్భముననే కుండలినీ సంచారము.

దశముద్రాసమారాధిత కౌలినీ : శ్రీవిద్యయందు ముఖ్యమైనవి పదిముద్రలు. అవి సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశ, సర్వఖేచరి, సర్వబీజ, సర్వయోని, సర్వత్రిఖండ. ఈ పది ముద్రాదేవత చేత ఆరాధింపబడునట్టి పరదేవత. కౌళినీ అనగా కులసంబంధ పరాశక్తి.

శివబోధిని - శివజ్ఞాన ప్రదాయిని : శివస్వరూపమును తెలుపునది. స్పందశక్తియగు విమర్శనశక్తివలన శివజ్ఞానము బ్రహ్మజ్ఞానము స్వస్వరూప జ్ఞానమును కలుగచున్నందున అట్టిజ్ఞానము నిచ్చునదియని భావము. యోగవాసిష్ఠమున "స్పందేన లక్ష్యతే వాయుర్వహ్ని రౌష్ణ్యేన లక్ష్యతే, చిన్మాత్రమమలం శాంతం శివ ఇత్యుదితం తుయత్, తత్స్పందమయశక్త్యైవలక్ష్యతే నాన్యథా కిల" అని కలదు.

దశకరణవృత్తిమరీచిని గర్భయోగిని : ఈ ఆవరణ దేవతలు గర్భయోగినులని ముందుచెప్పబడినది. శ్రీదేవియొక్క కర్మేంద్రియ జ్ఞానేంద్రియ (పది) వృత్తులే ఆవరణ దేవతారూపములతో నుండినవనియు చెప్పబడినది. అతిమరలఅనుసంధితము.

ఏడవ ఆవరణ కీర్తన.

శహానా : రాగము త్రిపుట : తాళము

పల్లవి :

శ్రీ కమలాంబికాయాం భక్తిం కరోమి

శ్రితకల్పవాటికాయాం
చండికాయాం జగదంబికాయాం

అను పల్లవి
రాకాచంద్రవదనాయాం రాజీవనయనాయాం
పాకారినుతచరణాయాం ఆకాశాదికిరణాయాం
హ్రీంకారవిపినహరిణ్యాం హ్రీంకార సుశరీరిణ్యాం
హ్రీంకారతరుమంజర్యాం హ్రీంకారేశ్వర్యాం గౌర్యాం
॥శ్రీ కమలాం

చ ర ణ ము :
శరీరత్రయవిలక్షణ సుఖతరస్వాత్మానుభోగిన్యాం
విరించిహరీశాన హరిహయ వేదిత రహస్యయోగిన్యాం
పరాదివాగ్దేవతారూపవశిన్యాది విభాగిన్యాం
చరాత్మక సర్వరోగహర నిరామయ రాజయోగిన్యాం
కరధృతవీణావాదిన్యాం కమలానగరవినోదిన్యాం
సురనరమునిజన మోదిన్యాం గురుగుహవర ప్రసాదిన్యాం
॥శ్రీ కమలాం

దీని తాత్పర్యము :

ఆశ్రితజనులకు కల్పవృక్షమువంటిదియు, చండికయు, జగదంబికయు, పూర్ణచంద్రునివంటి ముఖము కలదియు, ఆకాశాదిపంచభూతములను కిరణములుకలదియు, హ్రీంకారమంత్రమను అడవియందు చరించు లేడివంటిదియు, హ్రీంకారమంత్రము సుశరీరముగాకలదియు, హ్రీంకారవృక్ష కుసుమమువంటిదియు, హ్రీంకారమునకు ఈశ్వరియు, గౌరియు, స్థూలసూక్ష్మ

కరణ శరీరత్రయమునకు అతీతమగు ఆత్మానుభవస్వరూపిణి యు, బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, ఇంద్రాదులచే తెలియబడిన రహస్య స్వరూపిణియు, పరాదివాగ్దేవతారూప వశిన్యాది దేవతారూపిణియు, చరాత్మక జగత్తుయొక్క సర్వరోగములను హరించు నిరామయమైన రాజయోగస్వరూపిణియు, చేతి యందున్న వీణను వాయించునట్టిదియు, కమలానగరమను పేరు గల తిరువాయూరునందు వేంచేసియున్నట్టిదియు, సుర, నర, ముని జనులకు సంతోషము కలిగించునట్టిదియు. సద్గురువైన గుహునికి వరము లిచ్చునదియునగు కమలాంబయందు నేను భక్తి చేయుచుంటిని.

ఈ కీర్తన ఏడవ ఆవరణ కీర్తన. ఇది సప్తమీవిభక్తి (జీ) యందున్నది.

శ్రీ చక్రమున సప్తమావరణ వివరము లీవిధముగా నున్నవి.

ఇది అష్టకోణ చక్రము. సర్వరోగహార చక్రమను పేరు గలది. కకారప్రకృతికము. పద్మరాగరుచిరము అష్టవిధమైన ప్రకృత్యాత్మకము. ఇచట దేవతలెనిమిదిమంది కలరు. వారు




వాగ్దేవతలు. వారి నామములు, వశినీ కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, కౌళినీ, సర్వేశ్వరీ. వీరుసంధ్యా రాగవర్ణమైన అరుణకాంతి దేహముల వారు. వీరికి రహస్యయోగినులని పేరు. చక్రేశ్వరి త్రిపురాసిద్ధాంబ. రసము హాస్యము. ఇచటనున్న యెనిమిదిమంది

దేవతలు వర్గాదివర్ణస్వరూపములు. (అ,క,చ,ట,త,ప,య,శ,) సంవిద్రూప పరదేవతయొక్క మనోబుద్ధి అహంకారములు పంచ భూతములు వెరసి యెనిమిదియు యీ అష్టకోణస్వరూపావ సితములు.

విశేషములు

ఈ కీర్తనలో శ్రీదేవికి సగుణసాకార, సగుణనిరాకార, నిర్గుణ శ్రీచక్రసంబంధ, మంత్రశాస్త్ర విషయిక నామములున్నవి.

సగుణసాకారనామములు : రాకాచంద్రవదనా, రాజీవనయనా, పాకారినుతచరణా, కరధృత వీణావాదినీ, కమలానగరవినోదినీ, సురనరమునిజన మోదినీ, చండికా, గౌరీ, జగదంబికా.

సగుణనిరాకారనామములు : ఆకాశాదికిరణా, విరించిహరీశాన హరిహయ వేదిత రహస్యయోగినీ.

నిర్గుణనామములు : శరీరత్రయవిలక్షణసుఖతర స్వాత్మాను భోగిని

శ్రీచక్రసంబంధనామములు : వశాదివాగ్దేవతారూపవశిన్యాది విభాగిని, చరాచరాత్మక సర్వరోగహరనిరామయ రాజయోగిని

మంత్రశాస్త్రసంబంధమైననామములు : హ్రీంకారవిపినహరిణి, హ్రీంకారసుశరీరిణి, హ్రీంకారతరుమంజరి, హ్రీంకారేశ్వరి.

తాత్త్విక విమర్శ :

చండికా ; శ్రీ కమలాంబికయే చండిక. శ్రీదేవి చండికారూప మున బహురాక్షస సంహారమొనర్చుట ప్రసిద్ధము. చండికా యనగా దుర్గాదేవి. ఆమెగారి చండికాసప్తశతి శ్రీదేవిప్రశస్తి సందర్భమున ముఖ్యమైనది. ఆమె జగన్మాత, జగదంబిక.

ఆకాశాదికిరణా : శ్రీదేవి పాదజనితమరీచులనుండి పంచ భూతాత్మకమైన ప్రపంచము ప్రభవించినది.
హ్రీంకారవిపినహరిణి : హ్రీంకారము భువనేశ్వరీమంత్ర బీజము. ఆలంకారికము. తన్మంత్రిమహాటవీమధ్య సంచారిణియని చెప్పుటకు హ్రీంకారవిపినహరిణి అనియు, హ్రీంకారసుశరీరిణియనియు, హ్రీంకార తరుమంజరియనియు, హ్రీంకారేశ్వరియనియు నామములు. హ్రీంకారముతో త్రిశతీనామస్తోత్రమున 60 నామములున్నవి. ఆనామములందిట్లే ఆలంకారికముగా శ్రీదేవిని వర్ణించు భావములున్నవి
శరీరత్రయవిలక్షణ సుఖతరస్వాత్మానుభోగిని : స్థూలసూక్ష్మ కారణ శరీరములకు విలక్షణమైన ఆనందానుభవమును ప్రసాదించునదియని భావము. అపరోక్షానుభూతి స్వరూపిణియని ప్రతిపాదితము
విరించిహరీశాన హరిహయవేదిత రహస్యయోగినీ : బ్రహ్మ విష్ణు మహేశ్వర ఇంద్రులచే తెలుసుకొనబడినసప్తమావరణ దేవతయైన శ్రీ కమలాంబిః సప్తమావరణ దేవతలకు రహస్య యోగినులని పేరు.
పరాదివాగ్దేవతారూపవశిన్యాది విభాగినీ : పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరి అని చతుర్విధమయి వాకుః. వశిన్యాది అష్టదేవతలు సప్తమావరణమునందున్న వాగ్దేవతలు. పరాదిచతుర్విధవాకుః–అష్టవిధవశిన్యాది వాగ్దేవతారూపమున నున్నదని భావము. వశిన్యాదిఎనిమిదిమంది వాగ్దేవతల వివరములుపైన చెప్పబడినవి.

చరాత్మక సర్వరోగహర నిరామయ రాజయోగిని - సర్వరోగ ము ఖ సాంసారికములు. ఇవి చరాత్మక జీవులను వేధించునవి. సాంసారికమైన రోగములను (దుఃఖములను) పోగొట్టు విద్యా స్వరూపిణి చిచ్ఛక్తి. శ్రీ కమలాంబ. ఆమె రాజయోగిని. ఆమె సర్వరోగహరచక్రవాసిని యని శ్లేషార్థము

కరధృతవీణావాదిని : రాజశ్యామల రూపమున శ్రీదేవి వీణా ధారిణి. శ్యామలామూర్తి శ్రీ కమలాంబికయే యని ప్రతిపాదన.

కమలానగరవినోదిని : తిరువారూరునకు కమలానగరమని నామాంతరము. అచ్చట వేంచేసియున్న శ్రీ కమలాంబిక.

సుకనరమునిజన మోదినీ - మునిజనులనగా నిత్య ఆత్మబ్రహ్మైక్య శీలము గలవారు. దేవతలకు, సాధకులైన నరులకు, మునిజను లకు సంతోషము కూర్చునదని భావము.

అష్టమావరణ కీర్తన :

ఘంటా : రాగము ఆది : తాళము

ప ల్ల వి

శ్రీ కమలాంబికేఽవావ శివే కరధృతశుకశారికే ॥శ్రీ కమ

అను పల్లవి

లోకపాలిని కపాలిని శూలిని

లోకజనని భగమాలిని

సకృదాలోకయ మాం సర్వసిద్ధిప్రదాయికే

త్రిపురాంబికే బాలాంబికే ॥శ్రీ కమ

చ ర ణం

సంతప్తహేమసన్నిభదేహే సదాఽఖండైకరసప్రభావే

సంతాపహరత్రికోణగేహే సకామేశ్వరీ శక్తిసమూహే
సంతతం ముక్తిఘంటామణి ఘోషాయమానకవాటద్వారే
అనంతగురుగుహవిదితే కరాంగుళినఖోదయ
విష్ణుదశావతారే అంతఃకరణేక్షుకార్ముక
శబ్దాదిపంచతన్మాత్ర విశిఖాత్యంతరాగపాశ
ద్వేషాంకుశధరకరే అతిరహస్యయోగినిపరే ॥శ్రీ కమలాంబికే

దీని తాత్పర్యము

హస్తములందు శుకశారికలను ధరించినదేవీ, లోకపాలినీ, కపాలినీ, శూలినీ, లోకజననీ, భగమాలినీ, సర్వసిద్ధిప్రదాయికా, త్రిపురాంబికా, బాలాంబికా, శుద్ధిచేయబడిన బంగారువన్నె దేహచ్ఛాయకలదానా, నిత్యమై అఖండమైన ఆనందరసప్రభావా, తాపత్రయములనుహరించు త్రికోణచక్రమందున్న దేవీ, మహా



కామేశ్వరీ, మహావజ్రేశ్వరీ, మహాభగమాలినీ అను ఎనిమిదవ ఆవరణ దేవతలతో కూడిన చక్రేశ్వరియైన త్రిపురాంబా, సిద్ధులకు స్వాగతముపలుకు ఘంటానాదము నిరంతరము కలిగిన మోక్ష కవాటద్వారముకలదానా, అనంతమూర్తియగుగురుగుహునిచే తెలియబడినదానా, కరాంగుళినఖోత్పన్న నారాయణదశాకృతీ, మనస్సను ఇక్షుకోదండమును, శబ్దాదిపంచతన్మాత్రలను పంచపుష్పబాణములను, రాగపాశమును, ద్వేషాంకుశమును ధరించిన కరములు కలదానా, ఎనిమిదవ ఆవరణదేవతలైన అతిరహస్యయోగిని స్వరూపిణీ, పరదేవతా, శ్రీకమలాంబికా-

నన్నుకొంచెము కరుణాదృష్టితో చూడుము.

ఇది యెనిమిదవ ఆవరణకు సంబంధించిన కీర్తన. ఇది సప్తమీవిభక్తి తరువాత చెప్పబడు సంబోధన ప్రథమావిభక్తి యందున్నది.

శ్రీ చక్రమునందు అష్టమావరణమునుగురించి వివరము లిట్లున్నవి. అష్టమావరణమునకు త్రికోణచక్రమని పేరు. దీని యొకరమూడుకోణములందును మూడుబిందువులున్నవి. దీని ఆకారము త్రికోణాకారము. దీనికి సర్వసిద్ధిప్రదాచక్రమని పేరు. నాదప్రకృతి గలది. దీనితత్వము గుణత్రయము. మహాకామేశ్వరీ, మహావజ్రేశ్వరీ, మహాభగమాలినీ అనువారు కోణత్రయదేవతలు. ఈ ఆవరణదేవతలు అతిరహస్యయోగినులు. ఈ చక్రేశ్వరి త్రిపురాంబ. అమృతమిచ్చుటి రసము. శ్రీపరాదేవి సంవిద్రూపమందు అవ్యక్తమహత్తత్వ, అహంకారములే యీ త్రికోణ దేవతలు.

మహాకామేశ్వరీ, మహావజ్రేశ్వరీ, మహాభగమాలినీ శక్తులు ముగ్గురు క్రమముగా ద్వంద్వముగానుండిరని సంప్రదాయము. ఆదిద్వంద్వము సృష్ట్యాదిని విలాసార్థముగా సత్వాది గుణభేదముననుసరించి మూడుద్వంద్వములుగా త్రికోణబిందువులందు ప్రకాశించుచున్నది. ఉత్తరకోణస్థబిందువు జాలంధర పీఠము. అందున్న ద్వంద్వము మహాకామేశ్వరీ శ్రీమదూర్థ నాథాత్మకము. వీరు సోమరాజబీజాధిష్ఠాతలు. ఉమామహేశ్వరులు. దక్షిణకోణస్థబిందువు పూర్ణగిరిపీఠము అందున్న ద్వంద్వము మహావజ్రేశ్వరీ షష్ఠీశదేవనాథాత్మకము, వీరు

కామరాజ బీజాధిష్ఠాతలు. వీరు లక్ష్మీనారాయణులు. స్వాగ్రి కోణస్థబిందువు కామగిరిపీఠము. అందున్న ద్వంద్వము భగమాలినీ మిత్రేశదేవనాథాత్మకము. వీరు వాగ్భవబీజాధిపతులు. వీరు వాణీహిరణ్యగర్భులు.

విశేషములు :

శివే! (శివా) వశము కాంతి శివుడు. కాంతి అనఇచ్ఛ. పరశివుని ఇచ్ఛారూపము దేవి. ఇచ్ఛారూపమైన శక్తికి శివుడే ఆధారము. శివునితో భేదములేనిది శివా. లేక అన్నియు ఈమెయందు విశ్రాంతి పొందుచున్నవిగాన శివా. (ఔణాదికనిపాతముచే నిదిసాధువు) ఈమెయందు మంగళకరగుణములు గలవుగాన శివా. (అర్శ ఆద్యచ్ ప్రత్యయము. జైనేంద్ర వ్యాకరణమున "శివాదయశ్చ" అను సూత్రమునకు సుభూతిచంద్రుడిట్లే వ్యాఖ్యానించెను. సకలభూతములకు మేలుచేయునది శివా.)

లింగపురాణమందు "శివుడెట్లో దేవియట్లు. దేవియెట్లో శివుడట్లు. ఇట్టి అభేదబుద్ధితో ఉమను శివా అనుచున్నారు" అనియు ఆ పురాణమునందే మరియొకచోట "ఉమాశంకరులకు నిజముగ భేదములేదు. రెండు రూపములుగనున్నను అది యొకటియే. సంశయములేదు" అనియు కలదు.

సూతసంహితయందు యజ్ఞవైభవఖండమందు "ఎవతె చిన్మాత్రమును (జ్ఞానమును) ఆశ్రయించిన మాయశక్తిరూపముగ నున్నదో, ఎవతె జ్ఞానమో, ఎవతె వికల్పరహితురాలో, ఎవతె స్వయంప్రకాశురాలో, సత్స్వరూపిణియో, పరా

నందమో, సంసారమును నశింపజేయునదియో ఆమె శివా. పరాదేవి. శివునికంటె వేరుకానిది శుభమును కలిగించునది. అట్టి దయావతి నెవరుపూజింతురో వారికిష్టార్థసిద్ధి ఆమె అనుగ్రహ ముచే గలుగును." అని కలదు.

శివాస్వరూపము ప్రకాశవిమర్శాత్మకము. జ్ఞానాత్మకము. మాయాతీతమైన చిద్రూపము. (శివే=ఓ శివా!),

కరధృతశుకశారిక : చేతియందు ధరింపబడినశుకము శారికయు కలది. శుకమనగా చిలుక. శారికయనగా వీణవాయించు కొడుపు. శుకమును వీణవాయించుకొడుపును ధరించుదేవి శ్యామల. శ్యామలామూర్తి అష్టవిధములు. మంత్రశాస్త్ర మున "శ్యామల" ప్రసిద్ధము. ఈమె మంత్రిణ్యాంబయని తాంత్రికభావములు. (శ్రీ లఘుశ్యామలాంబా, శ్రీ వేణు శ్యామలాంబా, శ్రీ వీణాశ్యామలాంబా, శ్రీ శారికాశ్యామ లాంబా, శ్రీ శుకశ్యామలాంబా, శ్రీ రాజశ్యామలాంబా, వాసంతిశ్యామలాంబా, మహాశ్యామలాంబా-అష్టవిధ శ్యామ లాంబామూర్తులు. ఈమూర్తులకు పూర్వామ్నాయమున ప్రత్యేక మంత్రములున్నవి.

కపాలినీ,శూలినీ : కపాలమును, శూలమును ధరించుదేవి దుర్గాదేవి.

భగమాలిని : పదునైదుతిథులును పదునైదునిత్యారూపము లనుధరించి శ్రీ చక్రమునవసించుచు శ్రీదేవిని సేవించుచున్నది. అందుభగమాలిని శుక్లపక్షమున ద్వితీయ, కృష్ణపక్షమున చతుర్దశి.

సర్వసిద్ధిప్రదాయిక : సర్వసిద్ధులనొసంగునదనియు, సర్వసిద్ధి ప్రదాయిక అష్టమావరణ దేవతయనియు.

త్రిపురాంబిక : త్రిపురాంబ, అష్టమావరణ అధిష్ఠాత్రి.

బాలాంబ : బాలామంత్రబీజములు మూడును అష్టమావరణ త్రికోణములందున్నవి (వాగ్బీజ, మన్మథబీజ, సోమరాజ బీజములు) అందుచేత సమిష్టి అష్టమావరణ త్రికోణచక్రము బాలాంబా రూపమే.

సంతప్తహేమసన్నిభదేహా : శుద్ధిచేయబడిన బంగారుసమమైన దేహచ్ఛాయగలది. బంగారుకామాక్షి యని చెప్పుకొనవచ్చును.

సదాఽఖండైక రసప్రభావే : నిరంతరమై, సంపూర్ణమైన ఆనందరసప్రభావము కలది.

"అఖండైక రసానందకరే పరసుధాత్మని.

స్వచ్ఛందస్ఫురణామత్రనిధేహి కులనాయికేనమః"

అని సంప్రదాయ ధ్యానశ్లోకము.

సంతాపహర త్రికోణగేహా : తాపత్రయమును హరించునట్టి త్రికోణచక్రమను అష్టమావరణ నివాసిని, తాపత్రయము ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికములు. ఈ తాపత్రయము శాంతించుటకై ఉపనిషత్ శాంతిపాఠమున శాంతిపదము మూడుపర్యాయములుచ్చరించుట. తాపత్రయము శాంతించగా లభించునవి వాసనాక్షయము, మనోనాశనము, తత్త్వజ్ఞానము.

సకామేశ్వరీశక్తిసమూహా మహాకామేశ్వరీ, మహావజ్రేశ్వరీ, మహాభగమాలినీ, అను అష్టమావరణ దేవతలైన శక్తుల సమూహమును కలిగియున్న చక్రేశ్వరియగు త్రిపురాంబ.

సంతతంముక్తి ఘంటామణి ఘోషాయమాన కవాటద్వార: యోగ్యులకు స్వాగతమునిచ్చునట్టి ఘంటాఘోషముగల మోక్ష కవాటద్వారము కలది

కరాంగుళినఖోదయ విష్ణుదశావతార : శ్రీ లలితాసహస్ర నామావళిలో 80వ నామము కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతి. శ్రీదేవి యొక్క కుడియెడమ చేతులయొక్క పది వ్రేళ్ళగోళ్ల సందులనుండి పుట్టిన నారాయణుని దశావతారములు కలది.

భండాసురునితో శ్రీదేవి యుద్ధము చేయునప్పుడు భండాసురుడు సర్వఅసురాస్త్రమును ప్రయోగించెను. దాని నుండి సోమక, రావణ, బలి, హిరణ్యాక్ష, హిరణ్యకశిపుడాది గాగల రాక్షసులుపుట్టి యుద్ధము చేయసాగిరి. అప్పుడు శ్రీదేవి కుడియెడమ చేతుల వ్రేళ్లగోళ్లనుండి క్రమముగా మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, దశరథరామ, బలరామ, కృష్ణ, కల్కిరూపములైన పది అవతారములు ప్రభవించి ఆ రాక్షసులను సంహరించెను. ఇట్లు బ్రహ్మాండ పురాణము నందు చెప్పబడినది.

అంతఃకరణేక్షు.. ... ధరకరే : మనోరూప ఇక్షుకోదండమును గురించి, పంచతన్మాత్రసాయకములను గురించి, రాగస్వరూప పాశమును గురించి, ద్వేషాంకురాకార అంకుశమును గురించి (ఇవి శ్రీదేవి ధరించు ఆయుధములగుట) ముందు కీర్తనలలో వివరింపబడినది.

అతిరహస్యయోగిని : అష్టమావరణ దేవతలు అతిరహస్య

యోగినులు.

గుప్తవిషయము :

కరాంగుళినఖోత్పన్న నారాయణదశాకృతి : జీవసంబంధమైన జాగ్రత్స్వప్నసుషుప్త్యాది పంచావస్థలు, ఈశ్వరసంబంధమైన పంచకృత్యములు అనుపదియు శ్రీదేవియొక్క నఖములనుండి అనాయాసముగనె పుట్టినవని భావము. నారాయణశబ్దము జీవేశ్వరసూచకము. దశాశబ్దము అవస్థను తెలుపును. (కృతి శబ్దము కృత్యపరముగా) జీవఈశుల దశవిధ అవస్థలు కృత్యములు. మోక్ష హేతువులుకావు. దేవిచే సృష్టింపబడిన మాయా కృత్యములు. ఆత్మజ్ఞానముచే వీనినెఱిగి మాయాతీతముగ మెరిగి ఆనందానుభూతిని పొందవలెను.

తొమ్మిదవ ఆవరణ కీర్తన :

ఆహిరి : రాగము రూపక : తాళము (త్రిస్రఏక)

పల్లవి

శ్రీ కమలాంబా జయతి అంబా శ్రీ కమలాంబా జయతి
జగదంబా శ్రీ కమలాంబా జయతి శృంగారరసకదంబా
మదంబా శ్రీ కమలాంబా జయతి
చిద్బింబా ప్రతిబింబేందుబింబా శ్రీ కమలాంబా జయతి
శ్రీపుర బిందుమధ్యస్థ చింతామణిమందిరస్థ
శివాకారమంచస్థిత శివకామేశాంకస్థా ॥శ్రీ కమలా

అను పల్లవి.

సూకరాననాద్యర్చిత మహాత్రిపురసుందరీం
రాజరాజేశ్వరీం సువాసినీం

శ్రీకర సర్వానందమయ చక్రవాసినీం చింతయేఽహం
దివాకరశీతకిరణ పావకాదివికాసకరయా
భీకర తాపత్రయాది భేదనధురీణతరయా
పాకరిపు ప్రముఖాది ప్రార్థితసుకళేబరయా
ప్రాకట్యపరాపరయా పాలితో దయాకరయా ॥శ్రీ కమలా
చరణం
శ్రీ మాత్రే నమస్తే చిన్మాత్రే సేవితరమాహరీశవిధాత్రే
వామాదిశక్తిపూజిత పరదేవతాయాః సకలం జాతం
కామాదిద్వాదశభిరుపాసితకాదిహాదిసాది మంత్రరూపిణ్యాః
ప్రేమాస్పదశివగురుగుహజనన్యాం ప్రీతియుక్త మచ్చిత్తం
విలయతు
బ్రహ్మమయప్రకాశిని నామరూపవిమర్శిని
కామకలాప్రదర్శిని సామరస్యనిదర్శిని ॥శ్రీ కమలా

తొమ్మిదవ ఆవరణను గురించిన యీ కీర్తన సర్వ విభక్తికము. అనగా ఎనిమిది విభక్తులందును కలదు. ఉదాహరణ కావ్యములందిట్లే ఎనిమిది విభక్తులందు రచన ముగింపు చేసి సర్వవిభక్తికమైన రచనచేయుట ఆచారము.

దీని తాత్పర్యము :

ప్రథమావిభక్తి : శ్రీ కమలాంబ జయించునుగాక-సర్వోత్కృష్టముగ నగుగాక. అంబిక, లోకమాత, శృంగారరసకదంబ (కూటము) మదంబ, శ్రీ కమలాంబ సర్వోత్కృష్టముగ నగును గాక. చిద్రూపమాన బింబముయొక్క ప్రతిబింబముగానున్న చంద్రబింబమువలెనున్న శ్రీ కమలాంబ సర్వోత్కర్షగా ప్రకా

శించు శ్రీపుర మధ్య బిందువునందు చింతామణి మందిరమున శివాకారమంచస్థితుడైన శివకామేశుని వామాంకమందున్న శ్రీ కమలాంబ సర్వోత్కర్షగా ప్రకాశించు చున్నది.

ద్వితీయావిభక్తి : వారాహీ మొదలగు శక్తులచే అర్చింపబడినట్టి రాజరాజేశ్వరీదేవిని సువాసిని, శ్రీకర (ముక్తిప్రదాన)మైన సర్వానందమయ చక్రవాసినియగు మహాత్రిపురసుందరిని శ్రీ కమలాంబికను నేను ధ్యానించుచున్నాను.

తృతీయావిభక్తి : సూర్యచంద్రాగ్నుల వికాసపరయగు శ్రీ కమలాంబికచేత, భీకరమైనటువంటి తాపత్రియములను భేదించుటయందు ధురీణయగు శ్రీ కమలాంబికచేత, ఇంద్రాది ప్రముఖులచే ధ్యానింపబడు దివ్యశరీరముగల శ్రీ కమలాంబిక చేత, ప్రకటయోగిని మొదలు పరాపరయోగిని వరకుగల తొమ్మిది విధములైన యోగినుల రూపము ధరించిన శ్రీ కమలాంబికచేత, దయాసముద్రయగు శ్రీ కమలాంబికచేత నేను రక్షింపబడు చున్నాను.

చతుర్థీవిభక్తి : మహాలక్ష్మి విష్ణురుద్రబ్రహ్మలవలన సేవింపబడిన శ్రీ కమలాంబికకై జ్ఞానస్వరూపిణియైన శ్రీ మాతకై నమస్కారము.

పంచమీ విభక్తి : వామాజ్యేష్ఠా మొదలగు శక్తులచేత పూజింపబడిన పరదేవతవలన సకలము పుట్టినది.

షష్ఠీ విభక్తి : మన్మథుడు మొదలగు పన్నెండుమంది ఉపాసకులచేత ఉపాసింపబడిన కాదివిద్యా, హాదివిద్యా, సాదివిద్యా స్వరూపిణియగు చిచ్ఛక్తిలో-

సప్తమీవిభక్తి : ప్రేమాస్పదురాలైన శివగురుగుహుని తల్లి యందు-

మనస్సు విలయము పొందునుగాక.

సంబోధనప్రథమ : ఓ బ్రహ్మమయప్రకాశినీ, నామరూప విమర్శినీ, కామకలాప్రదర్శినీ, సామరస్యనిదర్శినీ-

(నా మనస్సును లయింపుము)

తొమ్మిదవ ఆవరణ వివరములు :

అష్టమావరణయగు త్రికోణమధ్యమందు బిందురూపమున నున్నదీ ఆవరణము. ఇది బింద్వాకృతికలది. బిందురూపము దీనిప్రకృతి. దీనికి సర్వానందమయచక్రమని పేరు. దీనితత్త్వము పంచబ్రహ్మాత్మకము. ఈ చక్రేశ్వరి శ్రీ త్రిపురసుందరీదేవి. శాంతరసము ప్రధానమైనది. ఈ ఆవరణదేవత పరాపరరహస్య యోగిని. ఈ చక్రఅధిష్ఠాత్రి శ్రీ రాజరాజేశ్వరీ పరాభట్టారికా దేవి. ఈదేవి చంద్రకలాకిరీటముగలిగి చంద్రాగ్ని సూర్యరూప నేత్రత్రయము కలిగి మందస్మితము చేయుచుండును.

బిందుమధ్యస్థమున పంచబ్రహ్మాకార మంచస్థకామేశ్వరాంకస్థ. అరుణాంబరాది మహాభరణస్రగాఢ్య. అంకుశపాశ ధనుర్బాణైరలంకృతభుజ ఈ దేవిని శ్రీ శంకర భగవత్పాదుల వారు సౌందర్యలహరియందిట్లు వర్ణించిరి.

సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతిచింతామణిగృహే।
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయామ్
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్॥

[సుధాసింధువు మధ్యభాగమున కల్పవృక్ష శాఖలతో ప్రకాశించునట్టిమణి ద్వీపమునందు కడిమి తోపులచేత నొప్పియున్న చింతామణిగృహమునందు శివాకారమంచెపై పరమశివ పర్యంకమునన్న దేవిని ధన్యులైనవారు సేవింతురు.]

ఈ వివరములు తాంత్రిక గ్రంథములందు పెక్కుచోట్ల కన్పించుచున్నవి. ఈ తొమ్మిదవ ఆవరణ కీర్తనయందు పర దేవతయొక్క సగుణసాకార, సగుణనిరాకార, నిర్గుణ, శ్రీ చక్ర సంబంధనామములున్నవి. దీనియందు ఎనిమిది విభక్తులు ఉప యోగింపబడినవి. ఆ వివరములు.

(1) శ్రీ కమలాంబా జయతి — ప్రథమావిభక్తి
(2) మహాత్రిపురసుందరీం చింతయేఽహం — ద్వితీయావిభక్తి
(3) దివాకర... ప్రాకట్యపరాపరయా, దయాపరయాపాలితో — తృతీయావిభక్తి
(4) శ్రీమాత్రే చిన్మాత్రే... నమస్తే — చతుర్థీవిభక్తి
(5) పరదేవతాయాః సకలం జాతం — పంచమీవిభక్తి
(6) కాదిహాదిసాది మంత్రస్వరూపిణ్యాః — షష్ఠీవిభక్తి
(7) శివగురుగుహజనన్యాం మచ్చిత్తంవిలయతు — సప్తమీవిభక్తి
(8) బ్రహ్మమయప్రకాశిని, నామరూపవిమర్శిని కామకలాప్రదర్శిని, సామరస్యనిదర్శిని — సంబోధనప్రథమ

సగుణసాకారనామములు : శృంగారరసకదంబా, సూకరానన ద్యర్చిత మహాత్రిపురసుందరి, రాజరాజేశ్వరి, సువాసిని, పాక రిపుప్రముఖాది ప్రార్థిత సుకళేబర, దయాకర, సేవితరమా హరీశ విధాత్రి. శివగురు జనని.

సగుణనిరాకారనామములు : జగదంబా, దివాకరశీతకిరణ పావకాదివికాసకరా, భీకరతాపత్రయాది భేదనధురీణతరా.

నిర్గుణనామములు : బ్రహ్మమయప్రకాశిని, నామరూపవిమర్శిని. సామరస్యనిదర్శిని.

శ్రీచక్రసంబంధనామములు : చిద్బింబప్రతిబింబేందుబింబా; శ్రీపురబిందుమధ్యస్థ చింతామణిమందిరస్థ శివాకారమంచస్థ శివకామేశాంకస్థ; శ్రీకర సర్వానందమయ చక్రనివాసిని, ప్రాకట్యపరాపరా.

మంత్రశాస్త్రసంబంధమైనవి : కాదిహాదిసాది మంత్రస్వరూపిణి, కామకలాప్రదర్శిని.

విశేషములు :-

(1) సూకరాననాద్యర్చిత : సూకరానన అనగా వారాహి. ఈమెదండినీదేవి. "వారాహానందనాథస్య ప్రసన్నాత్మా మహేశ్వరీవారాహీతి ప్రసిద్ధేయం వరాహవదనేనవే" తి.

యజ్ఞవరాహమూర్తిచేత అర్చింపబడినదనికూడ చెప్పవచ్చును,

(2) శ్రీపురబిందుమధ్యస్థ చింతామణిమందిరస్థ శివాకారమంచస్థిత శివకామేశాంకస్థ : ఈ వివరణము పైన తెలుపబడినది.

(3) శ్రీకర సర్వానందమయచక్రవాసినీ : శ్రీకరమనగా మోక్షప్రదమైనది. నవావరణమునకు సర్వానందమయచక్రమని పేరు. ఆ చక్రమందు వసించు పరదేవత.

(4) దివాకరశీతకరణ పావకాదివికాసపర : సూర్యచంద్రాగ్నులకు ప్రకాశము నొసంగునది. "తస్యభాసాసర్వమిదంవిభాతి"

అను ప్రమాణముచేత చిచ్ఛక్తియగు పరదేవత స్వయం ప్రకాశము కలది.

(5) భీకరతాపత్రయము : ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక ములు. ఈ వివరములు ముందువచ్చినవి.

(6) పాకరిపుప్రముఖాదిప్రార్థితసుకళేబర : ఇంద్రాదులచే ప్రార్థింపబడిన దేహముకలది. దేవతలచే ప్రార్థింపబడి వారికార్య ములను తీర్చుటకై శ్రీదేవి దేహాకారమును స్వీకరించినదని సూచన. ఆమె దేవకార్యసముద్యతయై చిదగ్నికుండసంభూతయై దేవతల శత్రువులను వధించి ఇంద్రాదులను కాపాడినది.

(7) ప్రకట్యపరాపరయా : తొమ్మిది ఆవరణదేవతలకు యోగినులని పేరు. మొదటి ఆవరణమునందున్న దేవతలు ప్రకటయోగినులు. తొమ్మిదవ ఆవరణదేవత పరాపరయోగిని. మొదటి ఆవరణమునుండి తొమ్మిదవ ఆవరణమువరకు కల యోగినీదేవతల సమూహము.

వామాదిశక్తి పూజిత పరదేవత : వామా, జ్యేష్ఠా, రౌద్రీ మొదలగుశక్తులచేత పూజింపబడిన పరదేవత.

(9) కామాది ద్వాదశభిరుపాసితకాదిహాదిసాది మంత్ర స్వ రూపిణి : శ్రీదేవి ఉపాసకులు పన్నెండుమంది. మను, చంద్ర, కుబేర, లోపాముద్రా, మన్మథ, అగస్త్య, అగ్ని సూర్య, ఇంద్ర, షణ్ముఖ, ఈశ్వర, దూర్వాసోఋషులు. (మనుశ్చంద్రఃకుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః అగస్తిరగ్నిసూర్యశ్చ ఇంద్రస్కంద శ్శివస్తథా క్రోధభట్టారకోదేవ్యా ద్వాదశామీ ఉపాసకాః) వీరు ప్రత్యేక ప్రత్యేకముగా పంచదశీమంత్రము నేర్పరచినారు.

కావున పంచదశీమంత్రము ద్వాదశవిధములైనది. ఇందు కాది విద్య శివనిర్మితము. హాదివిద్య, సాదివిద్య అను భిన్నసంపుటీ భేదములు ప్రసిద్ధములుగా నున్నవి. (ద్వాదశవిద్యా భేదాః అన్యాస్త్రయోదశవిద్యాః శ్రీవిద్యార్ణవతంత్రే ద్రష్టవ్యాః)
(9) బ్రహ్మమయప్రకాశిని ; నామరూప విమర్శిని : చిద చిద్గ్రంథిరూపముగ పరస్పర వివేకముచే ప్రకాశించునవి జగత్తునకు అయిదు రూపములున్నవి. 1 అస్తి (కలదు) 2 భాతి (జ్ఞానము) 3 ప్రియం (ఆనందము) 4 నామ, 5రూపములు. ఇందు మొదటి మూడు బ్రహ్మరూపములు. మిగిలిన రెండు జగద్రూపములు. అనగా లోకమునకు సంబంధించినవి.

ఛాందోగ్యఉపనిషత్తు "ఆకాశమే నామరూపములను నిర్వహించుచున్నదని ఆ రెండింటిమధ్యలో బ్రహ్మకలదని, చిచ్ఛక్తి రూపాకాశమే నామరూపములనునిర్వహించుచున్నది. చిచ్ఛక్తిచే (జ్ఞానముచే) నామరూపములు నశింప బ్రహ్మయొకడే మిగులును. నామరూపములు రెండులేక మిగిలిన అధిష్ఠాన మాత్రమే బ్రహ్మ" అని చెప్పినది. ఈ భావమే బ్రహ్మమయ ప్రకాశిని, నామరూపవిమర్శిని అని కీర్తనయందు చెప్పబడినది. (ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా తేయదంతరా తద్బ్రహ్మేతి" చిచ్ఛక్తి రూపాకాశఏవ నామరూపకయోర్నిర్వాహకః తదుభయం వినా యదధిష్ఠానమాత్రమవశిష్యతే దేవబ్రహ్మేతి తదర్థః)
(10) కామకలాప్రదర్శిని : శివశక్తిసంపుటముగానుండి సకల తత్త్వ సముదాయమునకు, సకలవర్ణకదంబమునకు, శబ్దజాలము

నకు జన్మస్థానమై సర్వకారణముగానున్నది కామకలా. (చిత్తమయోఽహంకారస్స్వవ్యక్తాహార్ణ సమరసాకారః శివశక్తి మిథునపిండః కబళీకృతభువనమండలో జయతి.)

(11) సామరస్యనిదర్శిని : సమమైనరసముగల శివభక్తుల భావమే సామరస్యము. కాళిదాసు "భోక్తృభోగ్యకరణోర్మి సంక్షయే సామరస్యదోహినీ శివా" అని చెప్పినాడు. అనగా "భోక్తృభోగ్యములను అలలు నశింపగా శ్రీదేవి సామరస్య రసమును పితుకును" అని భావము. ఇదియే భావము "సామరస్య నిదర్శిని" అనుటయందు వ్యక్తమగుచున్నది. అభియుక్తోక్తులిట్లున్నవి. "పరస్పరతపస్సంపత్ ఫలాయితపరస్పరా ప్రపంచ మాతాపితరా ప్రాంచౌ జాయపతీస్తుమః" అని (చంద్రాలోక మను గ్రంథమున కలదు.)

సామరస్యనిదర్శిని అనగా సామవేదగాన నిదర్శినియని కూడ చెప్పవచ్చును.

మంగళ కీర్తన :

శ్రీ : రాగము ఖండజాతిఏక : తాళము

పల్లవి :

శ్రీ కమలాంబికే శివే పాహి మాం
లలితే శ్రీపతేవినుతి సితాసితే శివసహితే ॥ శ్రీ కమ

రాకా చంద్రముఖి రక్షితకోలముఖి
రమావాణీసఖి రాజయోగసుఖి
శాకంబరి శాతోదరి చంద్రకళాధరి
శంకరి శంకరగురుగుహ భక్తవశంకరి

ఏకాక్షరి భువనేశ్వరి ఈశప్రియకరి శ్రీకరి
సుఖకరి శ్రీమహాత్రిపురసుందరి.

ఇది మంత్రపుష్పసమయమునందో, లేక మంగళహారతి (కర్పూరనీరాజనము) నిచ్చునపుడో గానము చేయవలసిన మంగళ కీర్తన.

దీని తాత్పర్యము :
ఓ శివా! లలితాదేవీ, లక్ష్మీదేవిపతిచేతనుతింపబడినదానా, సితాసితా, శివసహితురాలా, రాకాచంద్రముఖీ, రక్షితకోలముఖీ, రమావాణీసతులకుసఖీ, రాజయోగసుఖీ, శాకంబరీ, శాతోదరీ, చంద్రకళాధరీ, శంకరీ, శంకరగురుగుహభక్తవశంకరీ, ఏకాక్షరీ మంత్రరూపిణీ, భువనేశ్వరీ, ఈశప్రియకరీ, శ్రీకరీ, సుఖకరీ, శ్రీ మహాత్రిపురసుందరీ శ్రీ కమలాంబికా నన్ను రక్షింపుము.

కామకలాస్వరూపిణియైన శ్రీ కమలాంబికను బహు నామములతో సంబోధించి తన్ను రక్షింపుమని ప్రార్థనకలదీ మంగళ కీర్తనలో.

ఈ నామములు సగుణపరముగా, నిర్గుణపరముగా ఉభయాత్మకముగా నున్నవి. ఈ నవావరణకీర్తనలు, ధ్యాన కీర్తన, మంగళకీర్తన శ్రీవిద్యాపరముగా రచింపబడినవి. శ్రీ కమలాంబికయొక్క మహిమను తెలుపుటకుద్దేశింపబడినవి. శ్రీ కమలాంబికయే చిచ్ఛక్తియని, కామకలా స్వరూపిణియని, లలితాదేవియని, రాజరాజేశ్వరియని, మహాత్రిపురసుందరి యని, పరాభట్టారకయని, శ్యామలాదేవియని, మహావారాహి యని, కామేశ్వరియని, భువనేశ్వరియని, పరమేశ్వరియని

తెలుపుచున్నవి.

లలితయనగా "లోకము నుమించిన లలిత" గాన ఆమె లలిత యని పేర్కొనబడినది. శోభ, విలాసము, గాంభీర్యము, మాధుర్యము, స్థైర్యము, తేజస్సు, లాలిత్యము, ఔదార్యము, సౌకుమార్యము అద్వితీయముగా మూర్తికట్టిన మూర్తి లలిత.

ఈ సందర్భమున బహ్వృచోపనిషత్తును గమనింపవలసి యున్నది.

"సైషాపరాశక్తిః। సైషాశాంభవీ విద్యా కాదివిద్యేతివాహాది విద్యేతివా సాదివిద్యేతివా రహస్యం ఓం ఓం వాచి ప్రతిష్ఠా। సైవపురత్రయం శరీరత్రయం వ్యాప్య బహిరంతరవభాసయంతీ దేశకాలవస్త్వంతరా సంగాన్మహా త్రిపుర సుందరీ వై ప్రత్యక్చితిః। సైవాత్మతతోన్యదసత్యమనాత్మా అత ఏషా బ్రహ్మసంవిత్తిః। భావాభావకళానిర్ముక్తా చిద్విద్యాఽద్వితీయ బ్రహ్మసంవిత్తిః సచ్చిదానందలహరీ మహాత్రిపురసుందరీ బహిరంతరమనుప్రవిశ్య స్వయమేకైవవిభాతి। యదస్తిసన్మాత్రం యద్విభాతిచిన్మాత్రం యత్ప్రియమానందం తదేతత్సర్వాకారా మహాత్రిపురసుందరీ। త్వంచ అహంచ సర్వం విశ్వం సర్వదేవతా ఇతరత్సర్వం మహాత్రిపురసుందరీ। సత్యమేకం లలితాభిఖ్యం వస్తు తదద్వితీయామ్ అఖండార్థం పరంబ్రహ్మ। పంచ రూపపరిత్యాగాదశ్వరూప ప్రహాణతః అధిష్ఠానం పరంతత్త్వమేకం సచ్ఛిష్యతే, మహాదితి। ప్రజ్ఞానం బ్రహ్మేతివా అహం బ్రహ్మాస్మీతి వా భాష్యతే తత్త్వమసీత్యేవ సంభాష్యతే।

అయమాత్మా బ్రహ్మేతివా. అహం బ్రహ్మాస్మీతివా బ్రహ్మైవాహమస్మీతివా యోహమస్మీతివా సోహమస్మీతివా యోஉసౌ సోహమస్మీతివా యాభావ్యతే। సైషాషోడశీ శ్రీవిద్యాపంచదశాక్షరీ శ్రీ మహాత్రిపురసుందరీ బాలాంబికేతి, బగళేతి వా మాతంగీతి, స్వయంవరకల్యాణీతి, భువనేశ్వరీతి, చాముండేతి, చండేతి, వారాహీతి, తిరస్కరిణీతి, రాజమాతంగీతి వా, శుకశ్యామలేతి వా, లఘుశ్యామలేతి వా, అశ్వారూఢేతి వా, ప్రత్యంగిరా ధూమావతీ, సావిత్రీ, గాయత్రీ, సరస్వతీ, బ్రహ్మానందకళేతి।"

శ్రీ పరదేవత చండిక, దుర్గా మొదలగు రూపములతో ఆవిర్భవించి దుర్జనులను నిగ్రహించి సజ్జనరక్షణముచేసినగాథలు లలితోపాఖ్యానము నందు, మార్కండేయ పురాణమునందు, దేవీభాగవతమునందు - యితర పురాణములందు విశేషముగా కలవు.

మంగళకీర్తనయందు కొన్ని విశేషములు :

శ్రీపతివినుతా : శ్రీమన్నారాయణునిచేత వినుతింపబడినది. విష్ణువుకూడ శ్రీదేవి ఉపాసకులందొకడు. (... ఈశానశ్చరతిశ్చైవ తథానారాయణస్తథా బ్రహ్మజీవోమహాదేవ్యా ఉపాసకాస్త్రయోదశ ...) శ్రీహరి పరదేవతను ఉపాసించినందువలననే విష్ణుపదవియందున్నాడని శ్రీ శంకరభగవత్పాదులు సౌందర్యలహరియందు "హరిస్త్వామారాధ్య" అను శ్లోకమునందు చెప్పిరి.

రాజయోగసుఖ: రాజయోగమునందు సమాధిసుఖప్రదాయిని.
రాకాచంద్రముఖి : 'ఒక కళహీనమైనది సానుమతి. పూర్ణచంద్రుడుగలది రాక'-అని ఆగ్నేయ పురాణమునందు చెప్పబడినది. పూర్ణచంద్రునివంటి ముఖముకలది.
శాకంబరి : ఒక మంత్రస్వరూప శక్తిమూర్తి.
శాతోదరి : కృశించిననడుముకలది. ఇది సౌందర్య లక్షణము.
ఏకాక్షరి : శ్రీదేవియొక్క మంత్రములలో కొన్ని ఏకాక్షర మంత్రములున్నవి. తన్మంత్రస్వరూపిణియని భావము.
సుఖకరి : ఆనందప్రదాయిని.
శ్రీకరి : మోక్షప్రదాయిని.

శ్రీదేవీతత్త్వమును అగస్త్యముని శాక్తసూత్రములందు నిరూపించెను. అట్లే కామకలాసూత్రములందున్నది.

శ్రీ శంకర భగవత్పూజ్యపాదులకు పరమగురువులైన శ్రీ గౌడపాదాచార్యులవారు శక్తిసూత్రములందు వివరించిన విషయములు కొన్ని ప్రకృతమునకు అనుసంధింపవచ్చును.

"సా భగవతీ జగత్ సృష్ట్వేదం తస్మిన్ దేవాదీనుత్పాద్య, తేషామనుగ్రహాయ, స్వభక్తానాం పురుషార్థాయ, భండాసురాదిహరణాయాపిచ యా బ్రహ్మణః స్వప్రకాశాచిత్ దేవీరూపేణాభివ్యక్తా సతీ ధర్మసంస్థాపనార్థాయ। తతశ్చానేకరూపేణ పశ్చాన్మరీచ్యాదయోఽభివ్యక్తాః। తేషాంజ్ఞానైశ్వర్యబలవీర్య తేజోభిః సదాసంపన్నత్వమితియావత్। తస్యతారతమ్యాదాదా విశ్వకర్మణా దుగ్ధోదధి మధ్యస్థిత మణిద్వీపస్థం

చతుర్వింశతి వప్రవిశిష్టం చింతామణి మందిరం కల్పయిత్వా। తత స్తత్ర చిత్ప్రాకాశామేవ తాం దేవీం ప్రతిష్టాప్య పశ్చా దనేక శక్తయః పురోవర్తిన్యః స్థితాః తా ఆమ్నాయత్వ సంజ్ఞాయా తన్మాదిరస్య ఋగ్వేదాదిమయ చతుర్ద్వారే వక్ష్య మాణే స్థాపితాశ్చ నియమితాః॥"

ఈ వివరణమునుబట్టి శ్రీచక్ర విషయము బోధకమగు చున్నది.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు శ్రీవిద్యా సంప్రదాయము నందు పూర్ణదీక్షాపరులై సుశిక్షితులై ఆ విద్యారహస్యములను నవావరణ కీర్తనలందు గుంఫించిరి

ఓం ఓం ఓం ఓం ఓం

జయ జయ జగదంబ భక్తివశ్యే
జయ జయ సాంద్రకృపావశాంతరంగే
జయ జయ నిఖిలార్థదానశౌండే
జయ జయ హే లలితాంబ చిత్సుఖాబ్దే ॥

ఓం ఓం ఓం

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

# ఇతర కృతులు

## 1

కనకాంబరి రాగము - తిస్ర ఏకతాళము

ప. కనకాంబరి కారుణ్యామృతలహరి
కామాక్షి మామవ కామేశ్వరి

అ. దినకర చంద్ర తేజః ప్రకాశకరి
దేవి మహాత్రిపురసుందరి శంకరి ॥కన

చ. త్రైలోక్య మోహనాది చక్రేశ్వరి
త్రైపద పరబ్రహ్మమహిషి భాస్వరి
సాలోక్యాది ముక్తిప్రదానకరి
సదా శివకరి గురుగుహోదయకరి
మూలాది నవాధారేశ్వరి శుభకరి
నీలాలకధరి నిత్యానందకరీ లీలావిశ్వోత్పత్తిస్థితిలయకరి
బాలా పరమేశ్వరి పంచదశాక్షరి ॥కన

## 2

ఫేనద్యుతి రాగము - ఆదితాళము

ప. శ్రీదక్షిణామూర్తిమీశం చిత్ప్రకాశం ప్రణౌమి॥

అ. వేదాంతవేద్యం న్యగ్రోధవృక్షమూలవాసినం
వల్లకీనాదానుభవ మమృతఫేనద్యుతి మందస్మిత
ముఖాంబుజం

చ. జననాది ఖేదభంజనచతురం జగదీంద్రజాల
చమత్కృతికరం
మునిజనాది నిఖిలసంశయహారం ముద్రాకరం
గురుగుహాకరం
అనాద్యవిద్యాతమోభాసకరం ఆచార్యశేఖరం సుందరం
మనోవాగగోచరం శశిధరం మానినం మదనహారం
శంకరం॥

## 3

గానసామవరాళి రాగము - త్రిస ఏకతాళము

ప. బృహదీశ్వరో రక్షతు మాం హరి
బ్రహ్మేంద్ర పూజిత స్సతతం.
అ బృహన్నాయకీ సహితానందయుతో
భ్రాంతిస్వరూప ప్రపంచాతీతో
సహజగాన సామవరాళీ వినుతో
సదాశివో వినతగణేశగురుగుహో॥

## 4

భానుమతి రాగము - ఆదితాళము

ప. బృహదంబా మదంబా జయతి
బ్రహ్మాండస్వరూప జగదంబా
అ. మహాదేవయువతీ భానుమతీ
మద్గురుగుహజననీ నిరంజనీ
మహేశ్వరీ రాజరాజేశ్వరీ
మహాత్రిపురసుందరీ శంకరీ ॥

## 5

మనోరంజని రాగము - మఠ్యతాళము

ప. బాలాంబికే పాహి భద్రం దేహి దేహి

అ. సాలోకాది ముక్తిసామ్రాజ్యదాయిని
శంకర నారాయణ మనోరంజని ధనిని
నీలకంఠ గురుగుహ నిత్యశుద్ధ విద్యే ॥బాలా

## 6

తనుకీర్తి రాగము - మిశ్రఏక తాళము

ప. చిదంబర నటరాజ మూర్తిం
చింతయామ్యతనుకీర్తిం ॥

అ. మదంబా శివకామీపతిం
మదనజనక మహిత పశుపతిం గురుగుహవినుతం ॥

## 7

సేనాగ్రణి రాగము - తిస్రఏక తాళము

ప. జ్ఞానాంబికే పాలయ మాం శ్రీ
జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ స్వరూపిణి ॥

అ. సేనాగ్రణీ ప్రముఖోపాసితే
సితాసితేఽఖిలదేవతా సేవితే ॥
జ్ఞానప్రద గురుగుహ విజ్ఞానఘనే ఘనజఘనే
దీనావన శ్వేకణేశ దివ్యలలనే శోభనే ॥

## 8

పున్నాగవరాళి రాగము - ఆదితాళము

ప. ఏహి అన్నపూర్ణే సన్నిధేహి సదా పూర్ణే సువర్ణే మాం

అ. పాహి పంచాశద్వర్ణే మాం పాహి పంచాశద్వర్ణే శ్రియం
దేహి రక్తవర్ణే అపర్ణే

చ కాశీక్షేత్ర నివాసినీ కమలలోచన విశాలినీ
విశ్వేశమనోల్లాసినీ జగదీశ గురుగుహ పాలినీ !
విద్రుమ పాశినీ పున్నాగవరాళి ప్రకాశినీ
షట్త్రింశత్తత్త్వవికాసినీ సువాసినీ । భక్తవిశ్వాసినీ
చిదానంద విలాసినీ ।

## 9

అసావేరి రాగము - ఆదితాళము

ప. కుమారస్వామినం గురుగుహం
నమామి పరసరోరుహపదం ॥శ్రీ

అ. హిమాద్రిజాసుతం సురపతినుతం
హిరణ్య మణి కుండలాలంకృతం
భ్రమాత్మక విశ్వాకరం సురవరం
భ్రాంతిహార చతురతరం శుభకరం

చ. కార్తికేయం బాహులేయం కాంచనమయదేహం
శిఖివాహం
కార్తస్వరహారం శ్రుతిసారం గర్విత శూరాది సంహారం

పూర్తివిద్యాక్షరదం తత్పరం మూర్తికరం
మూలాజ్ఞానహరం
కీర్తిశాలినం వినతశూలినం ఆర్తిభంజనమశేషరంజనం.

## 10

నటాభరణ రాగము - రూపకతాళము

ప. విశ్వనాథం భజేహం సతతం
విశాలాక్షీశం పరమేశం
అ. నశ్వరప్రపంచాధిష్ఠానం నందితురంగయాన మీశానం
ఉచ్ఛ్వాసాజపా నటాభరణం ఉత్తమ గురుగుహ
పూజితచరణం.

## 11

కోకిలారవ రాగము - ఆదితాళము

ప. కోదండరామ మనిశం భజామి
కోకిలారవ జానకీరమణం
అ. పాదజ పాంసుపాలితాహల్యం
పరమేశ్వర గురుగుహావాత్సల్యం
వేదాంతవేద్య మతికౌశల్యం
విశ్వామిత్రహిత మకౌటిల్యం ॥

## 12

రూపవతి రాగము - మిశ్రఏక తాళము

ప. శ్రీకృష్ణం భజరేరే మానస
శ్రీరూపవతీ గోపస్త్రీ జారం

అ. చక్రనివారిత భాసహరప్రకాశం
చంద్రశేఖరగురుగుహ విశ్వాసం
అక్రూర వందితపదం అర్జునప్రేమాస్పదం
నక్రహత దంతివరదం నత శుక సనక నారదం.

## 13

హెజ్జజ్జి రాగము - ఆదితాళము

ప. రామచంద్రభక్తం భజ మానస
రాక్షసాంతకం హనూమంతం (శ్రీ)
అ. అనిమిషీకృతదివాకరం గేయ హెజ్జజ్జిరాగ ప్రీతికరం
వామ దాన భేద దండ చతురం సద్గురుగుహసమ్మోదితవరం

## 14

వాటీవసంతభైరవి రాగము - త్రిపుటతాళము

ప. ప్రసన్న వేంకటేశ్వరం భజరే
వాటీ వసంతభైరవీనుతం (శ్రీ)॥
అ. ప్రసిద్ధ తంజనగరస్థితం ప్రబలగురుగుహ వేదమాద్యం
వసిష్ఠవామదేవవిదితం వరాలమేలు మంగాశ్రితం
రసికశేఖరం కృపాకరం రక్షితభక్తానందకరం.

## 15

సాళంగనాట రాగము - త్రిపుటతాళము

ప. అవ్యాజకరుణాకటాక్షి అనిశం మామవ కామాక్షి ॥

అ. రవ్యాదినవగ్రహోదయే రసాళంగనాటకాప్రియే
దీనావనగురుగుహప్రియే సవ్యాపసవ్యమార్గస్థే
సదా నమస్తే శుకహస్తే

## 16

ఛాయాగౌళ రాగము - మిశ్రఏక తాళము

ప సరస్వత్యా భగవత్యా సంరక్షితోఽహం
ఛాయాగౌరతరయా వరయా ॥శ్రీ

అ. విరించి ప్రాణనాయికయా వీణావాదనోత్సుకయా।
సరససంగీత సాహిత్యా స్తనద్వయయా పరాద్వయయా

చ. చతుష్షష్టికలాత్మికయా సమస్తవర్ణాత్మికయా
శ్రితజనపాలకయా సేవక భూపాలకయా
శ్రుతిప్రతిపాదితయా శుభ్రవస్త్రావృతయా
నతేంద్రాద్యఖిలదేవతయా నందగురుగుహ సుసేవితయా
రతీరమాగిరిజార్చితయా రత్నాభరణాలంకృతయా
మతిమజ్జిహ్వాగ్రస్థితయా మంగళప్రదయా సదయయా

## 17

మంగళకైశికి రాగము - మిశ్రఏక తాళము

ప శ్రీభార్గవీ భద్రం మే దిశతు
శ్రీరంగధామేశ్వరీ.

అ. సౌభాగ్యలక్ష్మి సతతం మామవతు
సకలలోకజననీ విష్ణుమోహినీ,

చ. మదనగురుమాలినీ మమ మనసి తిష్ఠతు
మధుకర విజయమంగళకైశికా నివసతు
సదనమధ్యే మహాలక్ష్మీ సదావిహరతు
సామజ హేమకుంభ స్నాపితా విజయతు
వదనయనానన శరసళినీ
పరమపురుష హరిప్రణయినీ వదనకమలగురుగుహాధరణీ
వరనుత రంగనాథరమణీ.

# 18

మేఘరంజని రాగము - రూపకతాళము

ప. వేంకటేశ్వర యాదవభూపతి మాశ్రయేఽహం
విశ్వకల్పావహం విద్వజ్జనకల్పభూరుహం పదసరసీరుహం.
అ. కంకశైలమధ్యస్థిత కార్తికేయ శివగురుగుహకరుణాకటాక్ష
పాత్రం కంజదళాయతనేత్రం కంకణ హార కిరీటా
లంకృత సుందరగాత్రం కాంచనవృష్టిప్రద మేఘరంజిత
బహుక్షేత్రం పంకజభవ ముఖ సురకృత సకలనిమాల
స్తోత్రం సంకల్పవికల్పరహిత సచ్చిదానందమాత్రం.

# 19

టక్క రాగము - రూపకతాళము

ప. సుందరమూర్తి మాశ్రయామి శివభూసురకులాబ్ధిచంద్రం
కరుణాసాంద్రం.

అ. కందర్పవిడంబన విగ్రహాకాంతిం
కామక్రోధాది రహితో పశాంతిం
మందస్మిత మృదువదనం మాణిక్యరుచిరసదనం
కుందముకుళనిభ రదనం గురుగుహామోదిత గదనం.

# 20

రేవగుప్తి రాగము - రూపకతాళము

ప. సదా వినత సాదరే సరసిజనయన సోదరే
పదారవిందే త్వామహం వందే.
అ. నిదాఘ జడభరతనుతే నిఖిల నిర్జర సేవితే
సదా శివానుగ్రహదేవతే సచ్చిదానందాస్పదే
ముదాబ్జ రేవగుప్తిరాగ మోదిత హృదయే సదయే
చిదానందామ్యై గురుగుహ శివజీవోదయే శివే.

# 21

కన్నడబంగాళ రాగము - ఝంపతాళము

ప. రేణుకాదేవీ సంరక్షితోహ మనిశం.
అ. వేణువాద్యాశ్రియుతే విజయనగరస్థితే
మాణిక్యభూషిణీ మధురభాషిణి
బాణసదృశాక్షిణీ పరశురామజననీ
కోణత్రయవాసినీ గురుగుహావిశ్వాసినీ
కన్నడబంగాళే గాంధర్వభంజని.

